# ఆంధ్రభూమి

సర్వవిషయములను చర్చించు
సచిత్రాంధ్రమాసపత్రిక.



స్థాపితము ౧౯౩౩.
సాలుచందా 1-8-0.
సంపాదకుడు :
ఆంధ్ర శేషగిరిరావు, బి. ఏ.

సంపుటము : ౪. యువ, ఫాల్గుణము : మార్చి, 1936. సంచిక : ౯.


## సంపాదకీయ సమాలోచన

### ౧. శ్రీయుత కాశీనాథుని సత్యనారాయణగారి పాత్రధారణము :—

శ్రీ సత్యనారాయణగారు ప్రస్తుతము పశ్చిమగోదావరి జిల్లా పాలకొల్లునందలి మునిసిపల్ హైస్కూలునందు ఉపాధ్యాయులై యున్నారు. వీరు ఉన్నతవిద్య నభ్యసించునప్పటి నుండియు నాట్యకళయం దభిరుచికలవారై దానిని పోషింప పాటుపడుచున్నారు. అయినను వీరు పాత్రధారణమును ప్రధానవృత్తిగా గైకొనక పోవుటచేత దూరపు పట్టణములకు వచ్చి పాత్రధారణము నొనర్చియుండలేదు. అగుటనే వారి నామము నాటకప్రియులగు ఆంధ్రులకు విశేషముగ పరిచయము కాలేదు. శ్రీనారాయణగారు గొప్ప గాయకులు కాకపోయినను హావభావాది ప్రకటనమునందు లెస్సయగు ప్రజ్ఞకలవారని చెప్పవచ్చును. డబ్బుపుచ్చుకొని యాక్టుచేయు కంట్రాక్టునటకులపద్ధతి వీరికి బొత్తిగా కిట్టదు. అవలంబించిన ఉపాధ్యాయవృత్తి వీరు పాత్రధారణమును ప్రధానవృత్తిగా చేకొనుటకు అడ్డంకిగానున్నది. అయినను సహజముగా నలవడ్డ నటనాకౌశలమును గాజువాజింపజాలక శ్రీనారాయణగారు యథావకాశమున పలునాటకములయందు వివిధములగు పాత్రముల ధరించి ప్రేక్షకుల మనములను రంజింపజేయుచున్నారు. ‘పాదుకాపట్టాభిషేక’ము’న దశరథుడు, ‘మార్కండేయనాటక’ము’న యముడు, ‘బృహన్నల’యందు కీచకుడు, ‘పద్మవ్యూహము’నందు అభిమన్యుడు,



శ్రీ సత్యనారాయణగారు.

'పాండవోద్యోగ విజయము'లయందు దుర్యోధనుడు, 'మధుసేవ'యందు రఘునాధరావు, 'ప్రతాపరుద్రీయము'నందు యుగంధరుడు మున్నగు పాత్రలను సమర్థతతో నటించియున్నారు. ప్రతాపరుద్రీయమునందు శ్రీయుత డాక్టర్ గోవిందరాజుల సుబ్బారావుగారి ప్రక్కను చెకుముకి పాత్ర ధరించి వారి ప్రశంసకు పాత్రులైరి. వరవిక్రయమున లింగరాజు పాత్ర ధరించి కీ. శే. కాళ్లకూరి నారాయణరావుగారిచే పొగడ్తలనందిరి. దుర్గావతి నాటకమునందు దుర్ముఖపాత్రను, భక్తనంద నాటకమున నందనారు పాత్రను ధరించి వీరు ప్రేక్షకుల మనములకు రక్తి నిగూర్చిరి. వీరు భక్తనందలో నందనారు పాత్ర ధరించి 'చిదంబరేశ్వరా! నీకు నాపై నించుక కృపగల్గదా?' అను నప్పటి చిత్రము ఈ సంచిక ముఖపత్రముపై ముద్రితమైయున్నది. విద్యావంతులగు ఇట్టినటుల ప్రవేశము వలన ఆంధ్రనాట్య రంగస్థలము నన్నెకెక్కగలదు.

### ౯. శ్రీయుత చేకుమళ్ళ రాజగోపాలరావుగారి యూరపుయాత్ర :—

ఆంధ్రపరిశోధకులును, ఆంధ్రగ్రంథకర్తలును, మదరాసు క్రైస్తవ కళాశాలయందు నూపరింటెండు ఆఫ్ వర్నాక్యులర్ స్టడీస్‌ను అను శ్రీయుత చేకుమళ్ళ రాజగోపాలరావుగారు ఈ నెల 26-వ తేదీని బయలుదేరి భాషాపరిశోధనసందర్భమున యూరపు ఖండమునకు వెడలనున్నారని తెలిసికొనుటకు ఆంధ్రభాషాసేవకుల కెల్లరకును అమందానందముగ నుండగలదు. ఆంధ్రభాషకు, ఆంధ్రజాతికి సంబంధించినవి అమూల్యములు, అపూర్వములుఅగు విషయముల నెన్నిటినో శ్రీరావుగారు పరిశోధించియున్నారు. తమ పరిశోధనాఫలితములను పాశ్చాత్యపండితప్రకాండులకు చూపి విశేషవిషయములను వారితో సంప్రదించి తెనుగును ఒక ఉన్నతస్థానమున నిలుప శ్రీవారు ఈయాత్రను తలపెట్టిరి. అయితే ఈయాత్ర విశేష ధనవ్యయమున కాని కడతేఱునదికాదు. రాకపోకల టిక్కెట్టే వేయిరూపాయలకు పైబడి యున్నది. ఈయాత్ర ఆంధ్రప్రతిష్టను పెంపొందింపజేయుటకైనది గావున ఆంధ్రులెల్లరు దీనికి యథాశక్తిని ధనసహాయముచేయుట తమ విధ్యుక్తధర్మముగ నెంచదగును. క్రైస్తవ కళాశాలానిర్వాహకులు ఈయాత్రసందర్భమున శ్రీరావుగారికి ఎంతయు తోడుపడుచున్నారని తెలిసికొనుటకు సంతోషముగనున్నది. జీతము నష్టమురాని ఆరు మాసముల సెలవు - పలువురు పాశ్చాత్యపండితులకు పరిచయలేఖలు - ఇచ్చి కళాశాలానిర్వాహకులు శ్రీరావుగారి కీ సందర్భమున తోడుపడుచున్నారు. ఆంధ్రప్రజాసంఘముకూడ యథోచితముగ ఈ సందర్భమున రావుగారికి తోడుపడవలసి యున్నది. తప్పక చేయవలసియున్న ఇట్టి తోడ్పాటు ఆంధ్రులకు పెద్దభార మనిపించకుండ ఉచితజ్ఞులగు శ్రీరావుగారు వారి కొక చక్కని ఏర్పాటును సూచించినారు. ఇరువదిరూపాయల విలువగల తమ గ్రంథములను పదునాలుగింటిని ఆరు రూపాయలకే ఈయ నిశ్చయించినారు. ఇరువదిరూపాయల వెలగల గ్రంథములు ఆరు రూపాయల తక్కువ వెలకు లభించుటయేగాక ఆ ఆరురూపాయలును ఆంధ్రప్రతిష్టను పెంపొందింపజేయుటకైన యాత్రావ్యయములకై సద్వినియోగ మందగలవు కావున ఆంధ్రదేశమునందలి ప్రతియొక గ్రంథాలయమును, ప్రతి ఉన్నతవిద్యాలయమును ఈ గ్రంథముల సెట్టు నొక్కొకదానిని వెలకు తీయునుగాక అని కోరుచున్నాము. వివరములకు శ్రీరావుగారిపేర 124 వెళ్లాల వీధి, వేపేరి పోస్టు, చెన్నపురి అని చిరునామాకు వ్రాయవలెను. శ్రీవారియాత్ర

నిర్విఘ్నముగ కొనసాగి ఆంధ్రకీర్తిని వెలయింప జేయునట్లు భగవాను డనుగ్రహించునుగాక అని ఆంధ్రభూమి మనఃపూర్వకముగ వాంఛించుచున్నది.

## ౯. సత్యదేవతను సంతోషపెట్టుదురుగాక !

ఆంధ్రభూమి నవంబరు సంచికలో ముసోలినీ అబిసీనియా దండయాత్రను గూర్చి మేము సంపాదకీయము వ్రాయు సందర్భమున ఒకచో నిట్లు లిఖించితిమి. '...సరిగా పదమూడు సంవత్సరములకు పూర్వము ఇదే మాసమున (అక్టోబరు) ఇరువదిరెండవ తేదీని ఆతని ఆజ్ఞపై ఆతని అనుచరులు రోము మహానగరమునకు మహాప్రస్థానము గావించిరి. ఆ ప్రస్థానము ఫలముగా ఆరురోజులలో ఇటలీ మంత్రాంగమంతయు ముసోలినీ ముష్టిలో ఇమిడిపోయినది.' దీనిని పురస్కరించుకొని యొకరు ఫిబ్రవరి గృహలక్ష్మిలో ఇట్లు ప్రశ్నించుచున్నారు. 'దేశచరిత్రలో ముసోలినీ 1922-వ సంవత్సరము అక్టోబరు 28-వ తేదీని రోము నగరమునకు మహాప్రస్థానము గావించెనని యున్నది. ఆంధ్రభూమి యిట్లు తెలుపుటకు కారణమేమి?' ఈ ప్రశ్నవైచిన వారును, దానిని ప్రచురించిన సంపాదకమహాశయులును మఱి యొకసారి మావాక్యములను గీతగీచిన పదములపై ప్రత్యేకదృష్టి నిలిపి చదువకోరెదము. ఏదోషముచేతగాని ఇంకను మావాక్యములందు వారికి తప్పే యగుపించుచో (1) Through Fascism to world power, (2) The Fascista Regeneration, (3) The Life of Benito Mussolini. అను గ్రంథములనుండి ఉద్ధరింపబడి మావాక్యములను రూఢముచేయు ఈ క్రింది వాక్యములను చదువగోరెదము.

It was the 22nd day of October, 1922.

. . . . . . . . .

The whole country was now waiting anxiously for some decisive action on the part of the Fascisti, but no one had any idea as to what it was to be. A march on Rome had often been talked about, and Mussolini made no secret of his intentions in that connexion.

. . . . . . . . .

Threateningly and stormily he said it, for in times of tempest delays are unpardonable. 'To-day and at once,' according to the motto of St. Catherine of Siena-Now is the right time.

. . . . . . . . .

In the meanwhile another great Fascista gathering was summoned at Naples. On October 24th the Congress opened. On the evening of that day Mussolini delivered a great speech at the San Carlo Theatre.

. . . . . . . . .

In another speech, delivered the same day at the review of the Fascisti, he said :

'Leaders, ligionaries, blackshirts of Naples and all Italy !

Today, without striking one wounding blow, we have conquered the burning, vibrating soul of Naples, the burning soul of all the South of Italy.'

. . . . . . . . .

The Congress broke up, in the orderly tumult of an army, with the fateful cry—'To Rome ! To Rome !'

. . . . . . . . .

That same evening at 10 p. m. the famous quadrumvirate was formed.

. . . . . . . . .

On the evening of the 27th Mussolini was at the theatre in Milan. Halfway through one act, word was brought to him. 'A telephone message. It was begun.'

. . . . . . . . .

The last motors left hurriedly, bearing the last copies of the ultimatum, which had been secretly made ready for some days past and which next day were to be placarded all over Italy.

గృహలక్ష్మిలో ఆవ్యాసమురచియించిన విదుషీమణియు, దానిని ప్రచురించిన సంపాదక పట్టభద్రులును తప్పుకానిదానిని తప్పుఅనినందులకు ఇపుడు మనస్సులోనైన - దురభిమానమును దూరముగనుంచి-పశ్చాత్తాపము పొందుదురేని సత్యదేవత సంతోషించును.

## ౯. 'గర్భస్రావము చేసికొనుహక్కుండవలెను.'

అను శీర్షికతో 'ఆంధ్రభూమి' ఫిబ్రవరి సంచికలో శ్రీమతి బి. వెంకటలక్ష్మమ్మగారు వ్రాసిన వ్యాసమును చర్చించుచు నలుగురు సోదరీమణులు తమ అభిప్రాయములను మాకార్యస్థానమునకు బంపియున్నారు. మఱిఇద్దరు సోదరీమణులు తమ అభిప్రాయములను కొలది దినములలో పంపుచున్నామని లేఖలు వ్రాసియున్నారు. అవి అన్నియు చేర్చి పైమాసపు సంచికలో ప్రచురింతుము. ఈవిషయమై వ్రాయ తలంపుగల ఇతరులుకూడ తమ అభిప్రాయములను మార్చి 15-వ తేదీలోపుగ మాకార్యాలయమునకు జేర్ప ప్రార్థించుచున్నాము.

# కారపుశనగలు

గృహలక్ష్మి అక్టోబరు సంచికలో శ్రీయుత చదువుల రామచంద్రయ్యగారు (బి.ఏ.) వ్రాసిన 'అబిసీనియా చరిత్ర' అను వ్యాసమున 'మెనెలెక్ అనంతరము అంతఃకలహములు జరిగి తరువాత అతని మనుమరాలు రాణిగను, ప్రస్తుత చక్రవర్తియగు రాస్‌టపారి ఆమెకు సంరక్షకుడుగను నియమింపబడి అంత్యమున నాతడే చక్రవర్తియయ్యెను.' అని వ్రాసిరి. దానిపై నవంబరుమాసపు ఆంధ్రభూమియందలి 'కారపుశనగల'లో నేనిట్లు వ్రాసితిని: 'అక్టోబరు గృహలక్ష్మిలో మెనెలెక్ తరువాత అబిసీనియాను అతని మనుమరాలు పాలించినదని వ్రాయబడ్డది. అన్ని చరిత్రల్లోను మనమడు పాలించాడని గలదు. మరి గృహలక్ష్మిలో ఇల్లా ఉండడానికి కారణమేమిటి? ఆడవాళ్ళపత్రిక కాబట్టి ఔచిత్యభంగం లేకుండా మనమడు మనమరాలుగా మార్పుచేయడమైనదా?' దీనికి గృహలక్ష్మి డిశంబరు సంచికలోకాని, జనవరి సంచికలో కాని ఎట్టి సమాధానము ఈయబడలేదు. ఫిబ్రవరి గృహలక్ష్మిసంచికలో శ్రీమతి అడపా సుగుణమణిగారు 'మీగడతఱక' అను శీర్షికతో దీనికి సమాధానము వ్రాయుచు "వ్యాసమున 'మనుమరాలు' అనియున్న చోట 'కుమార్తె' యని యుండవలెను. ఇది అచ్చుతప్పైనను కావచ్చును లేదా వ్యాసకర్త పొరపాటైనను యుండనోపు." అనిరి. గృహలక్ష్మి సంపాదకులు ఇచట నక్షత్రపుమార్కు పెట్టి ఫుట్‌నోట్‌లో ఇది వ్యాసకర్త పొరపాటు అని ఒప్పుకొనిరి. ఆవ్యాసకర్తయే ఇపుడు గృహలక్ష్మి సంపాదకులుగా ఉన్నారు. వ్యాసకర్తగా తాముచేసిన పొరపాటును సంపాదకులయి సవరించుకొనినందులకు రామచంద్రయ్యగారిని నేను కొనియాడుతున్నాను.

. . . . . .

అయితే ఒకసంగతి. తోడి గ్రాడ్యుయేటు నయిన నేను ఎత్తిచూపిస్తే తమ పొరపాటును ఒప్పుకోని చదువులవారు ఆడకూతురు పొరపాటై ఉండవచ్చునని అనుమానించిన మీదటనైనా ఒప్పుకున్నందుకు సంతోషింపవలసి ఉన్నది. కొందరు మగాళ్ళకు ఆడవాళ్లు చెపితేకాని నచ్చదు. అందులోను ఆడవాళ్ళ పత్రికకు సంపాదకులయినవారికి ఆడవాళ్ళు చెపితేకాని నచ్చకపోవడము సమంజసమే.

. . . . . .

శ్రీమతి అడపా సుగుణమణిగారి వ్యాసం చదివినమీదట ఎవరికైనా అసలు వ్యాసకర్తకంటె ఆమెకే అబిసీనియా చరిత్ర బాగా తెలిసిఉన్నదని తోచకపోదు. శ్రీమతిగారు ఎంతవఱకు చదువుకొనిరో నాకు తెలియదు. ఆమె గ్రాడ్యుయేటు మాత్రము కాదనుకుంటాను. అట్టియామె రచనమువలన నాతోడి గ్రాడ్యుయేటు అయిన చదువుల రామచంద్రయ్యగారి అక్షరమైన పొరపాటొకటి అంగీకరింపక తప్పకపోయినందులకు నేను చాల కించపడి సిగ్గిలుచున్నాను.

. . . . . .

నేను నవంబరులో వ్రాసిన ఈ విషయమునకు ఇంతవఱకు గృహలక్ష్మి సంపాదకులు సమాధానము వ్రాయకపోవుటకు కారణము శ్రీమతిగారిట్లు ఊహించుచున్నారు: 'బహు

శా, మఘలోపుట్టి పుబ్బలోమాడు సంచికలు వేనవేలు వెలువడు యిక్కాలమున పై విమర్శనము వారి దృక్పథమున పడెనో, లేదో, సంశయాస్పదమే.' కడుపుచలవకొఱకు తపస్సు ధారపోయు భారత స్త్రీలోకానికి చెందిన సోదరి సుగుణమణిగారు పత్రికలవేయైనను ఇట్టి చావులనుగూర్చి ప్రస్తావించుట బాగా [illegible]దని మనవిచేస్తున్నాను. సరే, దానికేమి ?

... ... ...

సంపాదకుడన్నవాడు బహుద్రష్ట కావాలంటారు. అయినప్పటికీ గృహలక్ష్మి సంపాదకులు ఆంధ్రభూమివంటి పత్రికలు చూడకపోవచ్చును కాని అబిసీనియావంటి దేశముల చరిత్రలు-పింగళి సూరన, చేమకూర వెంకటపతి మొదలగు కవుల గ్రంథములు చూడకపోతే ఎట్లా ? చూడలేదు కాబట్టే అబిసీనియా చరిత్రలో మనమడు మనమరాలుగా మారింది ; డిసంబరు మాసపు గృహలక్ష్మి సంపాదకీయంలో చేమకూరవారి 'ఏగతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరే కదా' అనే అర్థాంతరన్యాసము పింగళి సూరన్నదిగా పేర్కొనబడింది. బహుద్రష్టలు కాకపోబట్టే కదా గృహలక్ష్మి సంపాదకులు ఇల్లా తప్పులు వ్రాసి వానికి సవరణలు చేసుకుంటూ కాలక్షేపంచేస్తున్నారు.

... ... ...

ఇంతకీ ఏమిచూసినా చూడకపోయినా గృహలక్ష్మి సంపాదకులు ఆంధ్రభూమిని మాత్రం చూస్తోనే ఉన్నారని తెలుస్తోంది. జనవరి ఆంధ్రభూమిలోని కారపుశనగలు చదివి గృహలక్ష్మి ప్రొప్రయిటరీ సంపాదకులు చేమకూరవాని వాక్యమును పింగళి సూరన్నకు ముడిపెడుతూ సంపాదకీయము వ్రాసిన అప్పటి గృహలక్ష్మి సహాయ సంపాదకులగు శ్రీయుత పసుమర్తి కృష్ణమూర్తిగారిని పిలిచి ఈకారపు శనగల ప్రస్తావన తెచ్చి అదియొక నెపముగా ఎన్ని వారిని పనిలోనుండి తొలగించినారని తెలియవస్తోంది. ఈ కారపుశనగల మూలముగా శ్రీకృష్ణమూర్తిగారికి ఇంతటి నష్టము కలిగినందులకు నేను చాల విచారించుచున్నాను. శ్రీమతి సుగుణమణిగారు ఈ విషయమును తెలిసికొందురు గాక !

... ... ...

నవంబరునాటి ఆంధ్రభూమిలోని విమర్శనకు ఇంతకాలము పల్లకుండి శ్రీరామచంద్రయ్యగారు సంపాదకులయిన ఈఫిబ్రవరి సంచికలో ఇపుడు హఠాత్తుగా వారిని వెనుకవైచుకొనుచు శ్రీమతి సుగుణమణిగారు వ్యాసము వ్రాయుటలో కుంభకోణము ఏమైనా ఉన్నదేమో నాకు తెలియదు కాని ఎట్లో వారిని సమర్థించవలెనను ఆకాంక్ష శ్రీమతిగారికున్నట్లు మాత్రము స్పష్టమగుచున్నది. ఆ ఆకాంక్షలోనే వారు ఆంధ్రభూమిసంపాదకుల రచనలో ఒక తప్పును చూపడానికి ప్రయత్నించి పప్పులో అడుగువేశారు. మనతప్పుచూపిన పత్రికలో ఏదో తప్పు చూపబడుతోంది గదా అనేసంబరముతో గృహలక్ష్మి ప్రస్తుత సంపాదకులు దాన్ని ప్రచురించి ఆవిషయమున వ్యాసమువ్రాసినవారితోబాటు తామును తెలియని వారమే అనిపించుకున్నారు.

... ... ...

చేమకూరవారి అర్థాంతరన్యాసము విషయంలోలాగే అబిసీనియావిషయంలో కూడా చల్లగా సవరించుకుంటే పోయి ఉండేదానికి గృహలక్ష్మి సంపాదకులు దురభిమానగ్రస్తులై తీగె కదిపారు. తీగెతోబాటు డొంక కూడా కదలక మానదు. ఇంకా కదులుస్తారా?

—వి. విశ్వనాథము, బి.ఏ.

# చంపావతీనాటిక

[అక్బరుచక్రవర్తి ప్రత్యర్థియగు ప్రతాపసింహమహారాజుయొక్క పుత్రికయు, వీర బాలికయు అగు చంపావతి కథ.]


రచయిత:

యస్ - వెంకటసుబ్బయ్యచౌదరి


[గతసంచికకుతరువాయి.]

## ఏడవదృశ్యం

స్థానం—అరణ్యం            సమయం—ప్రాతఃకాలం

(రొట్టెలు తయారౌతున్నై. చంపావతి వస్తుంది.)

చంపా! నాన్నగారూ! ఈరోజు నీభాగానికి రెండురొట్టెలొచ్చినై. మీకో? నాభాగానికి వొకటో అరో మిగిలింది.

అమ్మగారిదగ్గరకు పోతున్నా. నీవిక్కడనేతిను. ఆతర్వాత మీ అమ్మభాగపు రొట్టెలు తీసుకొని పోదువుగాని. నేనూ, అమ్మ వొకచోటనే తింటాం.

నీయిష్టం. తల్లిగారిభాగంకూడ ఇవ్వండి. నే నామెగారికిస్తా. తీసుకెళ్లు. (రొట్టెలు తీసుకెళ్తుంది)

---

## ఎనిమిదవదృశ్యం

స్థానం—కుటీరసమీపం.            సమయం—మధ్యాహ్నం

చంప—నేనీరొట్టెలను తినడమా? తినకపోవడమా? నాలుగు దినాలనుం డొకమెతుకైనా నోట్లోవేసుకుని యెరుగ. ఆ. జ్ఞాపకమొచ్చింది ఈ రొట్టెలను దాచివుంచి సుందరుడు యేడ్చినపు డిస్తా.

(రొట్టెలను తొట్టిక్రింద దాస్తుంది)

---

## తొమ్మిదవదృశ్యం

స్థానం—కుటీరం            సమయం—ప్రాతఃకాలం

(తూర్పుదిక్కున సూర్యు డుదయిస్తున్నాడు. పశుపక్ష్యాదులు కోలాహలంచేస్తున్నై. ఆకాశాన శ్వేతమేఘాలు చరిస్తున్నై. ప్రతాపుడు చింతానిమగ్నుడై వుంటాడు. వొకసాధుని ప్రవేశం.)

సాధు—క్షుధార్తుడైన బ్రాహ్మణునికి భోజనంపెట్టండి బాబా!

ప్రతా—ఎవరువారు?

సా—వొకబీదబ్రాహ్మణుడు.

ప్ర—తమకేంకావాలి?

సా—నేను చాలారోజులనుం
డి ఆకలితో మాడుతు
న్నా. భోజనం పెడతారని
వచ్చా.
ప్ర—నా ఆతిథ్యం స్వీకరిం
చండి—దయచేయండి.
సా—మీరు భోజనసదుపా
యాలు చేస్తూవుండండి.
నేను స్నానంచేసివస్తా.
ప్ర—చిత్తం.

(భిల్లుడొకడు ప్రవేశిస్తాడు)
భిల్లు—స్వామీ! మీ చిన్న
కుమారుని మరణ వార్త
అక్బరు చక్రవర్తి విన్నా
డు.
ప్ర—విననీ.
భి—ఆమృత్యువునకు చక్ర
వర్తి బాగాదుఃఖిస్తున్నా
డని తెలిసింది.
ప్ర—యెందుకు దుఃఖించడు?

అతనూ పిల్లలుగన్న తం
డ్రే. హృదయంలో ప్రేమ
వాత్సల్యాలున్నై. గుణ
వంతుడు. తనకు కష్టం
గలిగినపుడుగాని యితరు
కష్టం తెలుసుకోలేడు మ
నిషి.
భి—యింకేమైన సెలవిస్తారా?
ప్ర—అవసరంలేదు, వెళ్లు.

---

## పదవదృశ్యం

స్థానం—కుటీరాంతర్భాగం  సమయం—దాదాపు మధ్యాహ్నం

(రాణాప్రతాపుడు దారాసహితంగా చింతగా కూర్చొనివుంటాడు. భార్య చెపుతూవుంటుంది.)

రాణి—మీరు చింతాక్రాం
తులై యుండడానికి కా
రణం?
ప్ర—నాబీదరికం తలుచుకుం
టే.....
రా—[illegible] మీతో చెప్పండి.
ప్ర—క్షుధార్తుడైన బ్రాహ్మ
ణుడు మన కుటీరానికి
ఆతిథ్యం పొందడానికి వ
చ్చి భోజనంలభించక తిరి
గి పోతాడు. అది దుఃఖా
నికి తక్కువ కారణం
కాదు. ఈబీదరికంవల్ల నా
కర్తవ్యాన్నికూడ పూ
ర్తి చేయలేకుండావున్నా.
రా—మీరు నిరాశజెందవద్దు.
భగవంతుడే మన మర్యా
దను కాపాడుతాడు.
ప్ర—మహాదుఃఖాన్ని సహిం
చడంవల్ల అపుడపుడు ఆ
స్తికులు నాస్తికులౌతా
రు. భగవంతుడున్నాడని
నాకు విశ్వాసం...
రా—అట్లా అనకండి, మహా
రాణాజీ! భగవంతు డం
తర్యామి.
ప్ర—మనకుటీరానికి వచ్చిన
బ్రాహ్మణుడు భోజనం ల
భించక తిరిగి పోయేసమ
యాన నాప్రాణాలీప్రపం
చంలో వుండవని ఆ అం
తర్యామికి తెలవదు.
రా—దుఃఖానికి సమయంగా
దు.
ప్ర—దుఃఖించడంలేదు. నా
హృదయంలోని ప్రతి వొ
క్కొక్క భాగం కన్నీళ్లు
కారుస్తూవుంది. (బ్రాహ్మ
ణు డాకలితో తిరిగిపోతా
డు) అని నాచెవులలో
చెపుతుందొక గుప్తశ
క్తి.

చంపావతీప్రవేశం

చం—బ్రాహ్మణు డాకలితో
తిరిగిపో నవసరంలేదు
ప్ర—ఎవరు?—చంపా!
చం—యేమండి?
రా—యిచటి కెందుకొచ్చా
వు?
చం—బ్రాహ్మణు డాకలితో
తిరిగిపోడని చెప్పడానికే
వచ్చా.
ప్ర—నీకు...నీకెవరు చెప్పా
రు?
చం—నేను చాటునవుండి మీ
మాటలన్నీ వింటున్నా.
మీరు అతిధివచ్చే మా
ర్గంచూడండి.
రా—పిచ్చిదానా! భోజనం
పెట్టకుండా అతిథిని సత్కా

రించేదెట్లా? . నీకెందుకు వెళ్లు.

చం—బ్రాహ్మణు డాకలితో తిరిగి పోడని నేను చెబుతున్నా.

ప్ర—యేవిధంగా ?

చం—నేనాయనకు భోజనం పెడతా.

ప్ర—నిజమేనా ?

చం—నిజమే.

రా—భోజన మెక్కడినుండి తీసుకొస్తావు ?

చం—ఆసంగతి మీకెందుకు?

రా—చెప్పుదూ కొంచెం.

చం—నావద్ద నిన్నటి [illegible] రొట్టెలు న్నై.

ప్ర—నిన్నేమి తిన్నావు ?

చం—నేనా... నేను... నేను అడవిపండ్లు తిన్నా.

ప్ర—రక్షించావు. [illegible] అతిథి సత్కారంజరి[illegible].

---

పదకొండవదృశ్యం

స్థానం—మైదానం సమయం—మధ్యాహ్నం

(సుందరుడు అన్యభిల్లబాలురతో ఆడుకుంటున్నాడు. తండ్రిరావడంజూచి [illegible] దగ్గరకు వస్తాడు.)

నాన్నగారూ !

యేమిటిరా ?

మీరెళ్లేదెక్కడికి ?

స్నానంచేయడానికి వెళ్లుతున్నా.

నాదగ్గర రెండుకానులున్నై తీసుకోండి.

వీటి నేమిచేయాలి ?

పిండి కొని తెచ్చి దానితో రొట్టెలుచేసి బ్రాహ్మణునికివ్వండి. బ్రాహ్మణుడు ఆకలితో తిరిగిపోవడానికి వీలుండదు.

నీ కీ కాను లెక్కడినుండి వచ్చినై ?

నాకు జ్ఞాపకం [illegible]. చాలారోజులనుండినావద్ద[illegible].

ఈ త్యాగ మెవరివద్ద[illegible] నేర్చుకున్నావు ?

మీవద్దనే

మరి...

అక్కయవద్ద.

---

పన్నెండవదృశ్యం

స్థానం—కుటీరం సమయం—మధ్యాహ్నం

(చంపావతి సాధుకోసం కెదురుచూస్తూవుంటుంది. కొద్దిసమయానికి సాధు వస్తాడు.

దయచేయండి.

(కుటీరంలోని ఆసనమ్మీద కూర్చోబెట్టి రొట్టెలున్న ఆకును సాధుముందుంచుతుంది)

అమ్మాయీ! నీ వెవ్వతెవు ? యెందుకిక్కడుంటున్నావు.

మహారాణా ప్రతాపసింహ్‌జీ కూతుర్ని.

(సాధు తినడం ప్రారంభిస్తాడు.)

రాణాకూతురువా ?

ఔనండి.

నీపేరు ?

చంపావతి.

బీదవారిరొట్టెలను తినడంలో యెంత ఆనందముంది చంపావతీ!

మా యీబీదరికమే గంజో అంబలో [illegible]స్తుంది.

మీపూర్వభాగ్యం నాలుగైదు దినాల్లో మీకు లభిస్తుంది.

(సాధుచేతులు [illegible] చుకొని వెళ్ళిపోతాడు.)

కరుణానిధే! [illegible] కొద్దిసుఖాని కెంత [illegible] వెచ్చించవలసి వచ్చి[illegible]? తం డ్రిగారూ! తల్లిగారూ! [illegible] డూ! రండి నా [illegible] భాగం పంచుకో[illegible]. [illegible] ప్రతాపుని పుత్రి[illegible] [illegible] త్కారం చేసిం[illegible].

(ప్రతాపుడు, రాణి, సుందరుడు మొదలైనవారు వస్తారు. చంపావతి పొట్టపట్టుకొని పోతుంది.)

---

## పదమూడవదృశ్యం

స్థానం—కుటీరం    సమయం—సంధ్యాకాలం

(క్షితిజంలో విలీనమయ్యే సూర్యుడు. మృత్యుశయ్యపై పడియున్న చంపావతి. అందరూ చింతానిమగ్నులై దగ్గరకూర్చుని వుంటారు.)

ప్ర—అమ్మాయీ, చంపావతీ!

చం—నాన్న... నాన్న గారూ! అబ్బా!

ప్ర—మృత్యుశయ్య మీద పడియున్న బిడ్డా! మమ్ము క్షమించు. నీకు మందిప్పించడానికైనా మావద్ద డబ్బులేదీదినం. (అశ్రుపాతం.)

చం—అమ్మా!... (యేడ్వవద్దని సైగచేస్తుంది)

సుం—అమ్మా! అమ్మా!

రా—యేమిటిరా? వెళ్ళి పండుకో.

సుం—నిద్రరావడంలేదు.

ప్ర—అక్బరుచక్రవర్తికి జవాబేమివ్వడం?

సుం—అమ్మా! అక్కయ్య యెందు కీవిధంగాపడివుంది?

రా—నిద్రపోతూవుంది.

ప్ర—తన చక్రవర్తిత్వాని కొప్పుకుంటే మనతో సంధిచేసుకుంటాడు అక్బరు చక్రవర్తి.

రా—ఆతర్వాత జరిగేదేమిటి?

ప్ర—మన బీదరికం దూరమాతుంది. నీబిడ్డలను గురించైనా సంధిచేసుకోమని వ్రాశాడు.

రా—ఆతర్వాత?

ప్ర—మన మేవాడరాజ్యం మనకు లభిస్తుంది.

రా—భిక్షమెత్తుకుంటూరా? రాణాజీ! యెవరైనా భిక్షమెత్తుకుని రాజ్యం సంపాదించారా?

ప్ర—లేదు.

రా—మహారాణా ప్రతాపుని జోలె భిక్షతో పెద్దది కాదు.

(గలగల ఆకులశబ్దం)

చం—ఎవరు?

రా—ఆకుల గలగలశబ్దం.

ప్ర—దేవీ! అక్బరు చక్రవర్తి దేవదూత. దయాసముద్రుడు.

రా—అయితేకావచ్చు. దానివల్ల ప్రయోజనం మనకు?

ప్ర—మనబిడ్డల దీనావస్థ కెంతో జాలిపడుతున్నాడు.

రా—ఎవరుచెప్పారు?

ప్ర—ఆయనవ్రాసినజాబు—యిదిగోచూడు. పిల్లలను గురించైనా సంధిచేసుకోమని వ్రాశాడు.

చం—నాన్నగారూ! అక్బరు చక్రవర్తి వుదారవంతుడని మీకీదినం తెలిసింది. రేపు మీకు పెద్ద వుద్యోగమిస్తాడు. తదుపరి మీ క్షత్రియధర్మాన్ని నాశనం చేసుకుంటారు.

ప్ర—చంపా!

చం—నీబిడ్డల దీనావస్థ చూస్తే జాలివేస్తుందని వ్రాశాడా అక్బరుచక్రవర్తి?

ప్ర—వ్రాయడమేకాదు. కబురంపాడు కూడ.

చం—మహారాణా ప్రతాపసింహుని బిడ్డలు దుఃఖాతపానికి వాడిపోయే గులాబి పుష్పాలు కారని తెలియయదు కాబోలు అక్బరు చక్రవర్తికి.

ప్ర—జాస్తిమాట్లాడకు. రోగమెక్కువాతుంది.

చం—యింకొకమాటే. తర్వాత మాట్లాడను.

ప్ర—ఆమాటేమిటి?

చం—మీరెవర్నీ ఆశ్రయించవద్దని నామనవి.

ప్ర—నారాజ్యంకొరకు యెవర్నీ ఆశ్రయించనని నీ మరణశయ్యవద్ద ప్రతిజ్ఞ

చేస్తున్నా.

చం—నిజమేనా ?

ప్ర—నిజం.

(సాధుప్రవేశం)

సా—అతిథికి తినడానికిచ్చిన నీరొట్టెలే హిందూదేశానికి ఆతిథ్యపాఠం నేర్పినై, బిడ్డా !

చం—ఎవరు? సాధుమహాశయులా ?

సా—(వేషంపరిత్యజించి) కాదు. హిందూదేశానికి చక్రవర్తినైన అక్బర్ని. రాణా! నీ సంతానం హంసతూలికాతల్పాల్లో శయనించడమెరుగు. చేయిచాచు.

ప్ర—యెందుకు ?

అక్బ—ఈనాటినుండి మనమిద్దరం స్నేహితులం. చంపావతీ! స్నేహభావంతో నీతండ్రి రాజ్యాన్ని నీతండ్రికిచ్చివేస్తున్నా. నీకు సంతోషమేనా ?

ప్ర—చంపా!

(చంపావతి శోకపర్యాయం ప్రక్కమార్చి స్వర్గప్రయాణంజేస్తుంది. అక్బరు శాంతిప్రార్థన చేస్తాడు.)

అ—చంపావతీ! భగవంతుడు నీకాత్మశాంతి చేకూర్చుగాక !

## పదునాల్గవదృశ్యం

స్థానం—మేవాడ  సమయం—ప్రాతఃకాలం

(మహారాణా ప్రతాపసింహుడు సింహాసనాసీనుడై వుంటాడు. ప్రజలు యథాస్థానంలో నిలబడి వుంటారు.)

ప్ర—గౌరవనీయ మేవాడవాసులారా! భయంకర యుద్ధాలతర్వాత మేవాడను దర్శించిన గౌరవదినమీదినం.

ప్రజలు—మహారాణా ప్రతాపసింహాజీకీ జై.

ప్ర—నాకుగాదు. నాబిడ్డలకు జైకొట్టండి. ప్రతాపుని ప్రతాపంగాదు. ప్రతాపుని పుత్రిక చంపావతీ ప్రతాపం. రేపటిసాయంకాలం నగరోద్యానవనంలో చంపావతీ ప్రతిమోద్ఘాటన జరుగుతుందని అందరికీ తెలియడానికి డప్పువేయించండి.

సేవకులు—చిత్తం.

## పదిహేనవదృశ్యం

స్థానం—రాజ్యమార్గం  సమయం—సాయంకాలం

(డప్పువాడు డప్పువాయించుకుంటూ వస్తుంటాడు)

రేపటిసాయంకాలం, నగరోద్యానవనంలో, మహారాణాజీ చంపావతీప్రతిమోద్ఘాటనం చేస్తారు గాన స్త్రీపురుషులు యావన్మందీ రావలసింది హో !!

## పదహారవదృశ్యం

స్థానం—రాజమార్గం  సమయం—సంధ్య

(ఉద్యానవనంలో రకరకాల పూలచెట్లు పూసివున్నై. బాతులు చెరువులో యీదుతున్నై. ప్రజలు గుమిగూడి వున్నారు. రాణాజీ ప్రతిమోద్ఘాటన చేశాడు.)

ప్రజలు—కుమారీచంపావతికీ జై. మహారాణా ప్రతాపసింహాజీకీ జై.

సుంద—యిన్నిరోజులనుండెక్కడున్నావక్కయా !

(సుందరుడు చంపావతీప్రతిమాన్ని కౌగలించుకుంటాడు.)

(శ్రీశ్యామసుందరలాల్ దీక్షితుని హిందీనాటికకనువాదం)

# 'గౌరీకల్యాణము' పాడిన గౌరి

రచయిత:
కాళూరి వెంకటరామారావు

[గతసంచికకు తరువాయి.]

వివాహం పూర్తి అయింది. బంధువుల్లో చాలామట్టుకు పల్చబడిపోయారు. మరి నాలుగురోజులున్న తరువాత మారిగాడి ప్రయాణం కూడా నిశ్చయమైపోయింది.

'మరునాడు ప్రయాణమనగా రాత్రి పది గంటలపుడు ఆలోచిస్తూవాడు గదిలో మంచంమీద పడుకున్నాడు. ఇంట్లో పనిపాటలు చేస్తూంది గౌరి. దానివేపు చూస్తూ ఉండగానే వాడికి కొంచెంనిద్రపట్టింది. ఆ నిద్రలో గౌరి తనదగ్గిరకొచ్చి రంగంపోదామన్నట్లూ, ఇద్దరూ కలిసి పడవయెక్కినట్లూ స్వప్నం వచ్చింది.

మరి కొంతసేపటికి వాడి వీపుమీద చల్లని వస్తువేదో తగిలినట్లయింది. ఆతురతతో లేచి పరికించి చూశాడు మారిగాడు. ఇంట్లోదీపం ఆరిపోయిఉంది. తలుపుమాత్రం తెరిచి ఉండడంచేత మంచందగ్గిరగా ఎవరో నిలబడి ఉన్నట్లు వాడు గ్రహించాడు.

అప్రయత్నంగానే వాడిచెయ్యి ఆ వ్యక్తి వంకకి పోయింది. కొంచెము చల్లగాఉన్న చీరకొంగు వాడి చేతికితగిలినది. ఆనందము, ప్రేమ, మోహము ఒక్కసారిగా వాడి హృదయాన్ని కలవరపెట్టేశాయి.

మంచంమీదనుంచి లేచి మారిగాడు వాకట్లోకి చూశాడు. పందిరకింద మంచాలమీదా, చాపలమీదా పగటి అలసటచేత ఒళ్లు తెలియకుండా నిద్రపోతున్నారందరూను. పందిరరాటకికట్టి ఒక గుడ్డిదీపంమాత్రం వెలుగుతూంది. అప్పటి కప్పుడే అర్ధరాత్రి దాటింది.

తలుపులు చేరవేసి మారిగాడు మెల్లిగా గౌరిదగ్గిర కొచ్చాడు. 'ఈవేళ నామీద కోపమొచ్చిందికాబోలు!' అన్నాడు. జవాబులేదు. చెయ్యిపట్టుకుని తనపక్కనే మంచంమీద దాన్ని కూచోబెట్టుకున్నాడు. దానికళ్ళల్లోకి చూస్తూ మళ్లా 'కోపమొచ్చిందా గౌరీ! నామీద?' అన్నాడు.

గౌరి నింపాదిగా 'కోపమెందుకూ'అంది.

'మరి సాయంత్రంనించీ అలాగున్నావేం?'

నిట్టూర్పువిడిచి గౌరి 'రేపు మళ్ళీ మీవూరువెళ్ళగానే గౌరిని మరిచిపోతావు కదా. ఇంక నేనలాగుంటే యెవరిక్కావాలి?'

మెడచుట్టూ చెయ్యివేసి గౌరిని తనమీదకి లాగుకొన్నాడు మారిగాడు. విచారసూచకమైఉంది దానిముఖం. చలనంలేకుండా ప్రియుడి బుజముమీద అలాగే పడుకుంది. దాని ముఖంమీద ముఖంపెట్టి మారిగాడు 'గౌరీ! అదా నీవిచారం? ఎన్నడూ అలా ఖం

గలనా?' అన్నాడు.

ఏదో భారంతగ్గిపోయినట్లుగా నిశ్వాసము విడిచి 'నిజంగానే?' అంది గౌరి.

'సందేహమెందుకు? మన దేవుడుసాక్షిగా.'

గౌరి ఒక పెద్ద నిట్టూర్పువిడిచి ఆ చీకట్లోనే వాడికళ్ళలోకి కృతజ్ఞతతో చూస్తూ 'నీతోనేఉంది సుమా నాబ్రతుకు' అన్నాది.

మారిగాడు దాన్ని తన బాహువుల్లోకి లాగుకొన్నాడు. హృదయం ప్రేమతో ఉక్కిరిబిక్కిరై పోయి వాణ్ణి మాట్లాడనియ్యలేదు. ఎన్నోసార్లు దాన్ని గాఢంగా ముద్దుబెట్టుకున్నాడు. నిర్జీవప్రతిమవలె గౌరి ఏజవాబూ లేకుండా వాడికౌగిట్లో అలాగే ఉండిపోయింది.

కొన్ని నిముషాలు గాఢనిశ్శబ్దము. వాళ్ళిద్దరి హృదయచలనముకూడా స్పష్టంగా వినబడుతూ ఉన్నంత నిశ్శబ్దము.

ఇంతలో వీధిలోఉన్న పందిట్లో ఏదో చప్పుడయింది. ఇద్దరూ ఉలికిపడి మంచంమీంద నుండి లేచారు. ఓరగిలవేసిన తలుపులు మెల్లిగా తీసుకుని గౌరి పెరటిలోకివచ్చి తల్లి పక్కలోకి పోయి పడుకుంది.

## ౫

మర్నాడు ఉదయాన్నే గౌరి ప్రయాణం. ప్రేమకాడిని వదలలేక వదలలేక గౌరి కన్నీళ్ళతో తల్లిదండ్రులతో వాళ్ళఊరు వెళ్ళిపోయింది. మారిగాడు వాళ్ళని కొంతదూరం దిగబెట్టి విచారంతో యింటికివచ్చాడు.

ఆవేళే మారిగాడుకూడా అత్తమామలు ఎంతచెప్పినా వినక గూడెం వెళ్ళిపోయాడు. ఇప్పుడు ఏతాముదగ్గరా పొలాల్లోనూ వాడి పాటలకి విధీ, విరామమూ లేదు. 'కొత్తకోక తీర్చాలట—మాటయిచ్చిందట, మరి తప్ప కూడదట, కోర్కె తీర్చాలట—గోదావరి పొంగిందట, కోటిపల్లి తీర్థమట, తీర్థమెల్లి రావాలట' ఇలాంటి పాటలతో మాలపిల్లి అంతా నిత్యమూ ప్రతిధ్వనిస్తూంది.

* * *

నాలుగునెలలు గడిచాయి. మారిగాడిపిన తండ్రి కొడుకైన బాపడికి గౌరిని యిచ్చి పెళ్ళి చేశారు. మారిగాడి మరదలి పెళ్ళిలోనే యీ పెళ్ళిమాటలు జరిగాయి. చివరకి ఆ మాటలే నిశ్చయమై వివాహంకూడా జరిగిపోయింది. గూడెం అత్తవారింటికి వెళ్ళిపోయింది గౌరి.

బాపడు మారిగాడికంటె రెండేళ్లు చిన్నవాడు. వాళ్ళది బాగా కలిగిన కుటుంబము. వ్యవసాయం, వ్యవహారంకూడా ఉంది వాళ్ళకి. 'గౌరి తనసొమ్ముకాలేదుకదా' అన్న విచారంతో ఉన్న మారిగాడికి, అది యెలాగో తనకంట బడుతూ యింటిముందరే ఉంటుందికదా అన్న ఆలోచన కొంత ఊరట కలిగించింది.

గౌరి హృదయంలో ఉండి దాని ఆదరణకి పాత్రుడవుతూఉన్న పురుషుడు వేరు. శరీరమంతా బాపడిపరమైనప్పటికీ దాని మనస్సు మాత్రం అన్యాయత్తమైపోయిఉంది. అత్తవారింట్లోఉన్న సౌఖ్యాలన్నీ దాని మనసుకేవిధమైన సంతోషాన్ని కలిగించలేక పోయాయి.

* * *

ఆరునెలలు గడిచాయి. ఒకనాటి సాయంకాలం ఆరుగంటలయింది. ఏతాముకట్టిపెట్టి దగ్గిరేఉన్న గెడ్డలో యిసకతిన్నెమీద కూచుని మారిగాడు ఆయాసం తీర్చుకుంటున్నా

డు. వాడికి గజందూరంలో స్వచ్ఛమైన జలము మోకాలులోతున ప్రవహిస్తూంది. అప్పుడే ఉదయించిన చంద్రకాంతియందు గెడ్డనీరు తళతళ మెరుస్తూంది. ఎత్తయిన ఒడ్డుమీదఉన్న వేప, మర్రి మొదలైన వృక్షాల నీడలు గెడ్డలో చాలాదూరం వ్యాపించి ఉన్నాయి.

మారిగాడు వెన్నెట్లో కూచున్నాడు. మందంగా వీస్తూఉన్న గాలికి వాడి గిరజాలు బలిష్ఠమైన మెడమీద కదులుతున్నాయి. గరిడీ దేరిన వాడి శరీరం వెన్నెలతేటలో నిగనిగలాడుతూంది. వాడేదో దీర్ఘాలోచనలో ఉన్నాడు.

కొంతసేపల్లా కూచుని, చప్పునలేచి నీట్లో దిగి, ఒళ్ళంతా చెమటపోయేటట్లు కడుగుకుని ఇన్ని మంచినీళ్లుతాగాడు. పైకివచ్చి తువ్వాలుతో ఒళ్లుతుడుచుకుంటూ యింటికి బైలుదేరాడు.

ఇసకలో గబగబనడుస్తూ మారిగాడు గెడ్డఒడ్డొనఉన్న చెట్లనీడలలోకి వచ్చాడు. కొంచెందూరంలో ఎవరో తనవేపు వస్తూన్నట్లు వాడు కనిపెట్టాడు.

క్రమంగా మారిగాణ్ణి సమీపించిందా వ్యక్తి. పదిగజాలదూరంలో ఉండగానే నడకనిబట్టి గౌరిని పోల్చుకున్నాడువాడు. ఎదురుగావెళ్ళి 'ఇంతాలస్యమయిందేం?' అని అడిగాడు. తిరిగీ జవాబుచెప్పక ముందే దాన్ని కౌగిలించుకున్నాడు. ఇంకా గాఢంగా ఉన్న చెట్లనీడలలోకి యిద్దరూ నడిచిపోయారు.

గౌరిముఖం దుఃఖాన్ని సూచిస్తూంది. ఇదివరకు లాగ చలాకీగా ఉండలేదది ఆరోజున. వేడినిట్టూర్పులు మారిగాడి హృదయాన్ని కాల్చివేస్తున్నాయి. దాన్ని దగ్గిరగా తీసుకుని వాడు 'గౌరీ! అలాగున్నావేం?' అని అడిగాడు దానివీపుమీద నిమురుతూ.

కొంతసేపు జవాబులేదు. చివరకొకనిట్టూర్పుతో 'ఎంతకాలం నేనిలాగుండడం?' అని మాత్రం అంది గౌరి.

'అంటే?'

'ఇంకమనకి యిలాగ సాగేటట్టు కనబడదు. మా అత్తా ఆళ్ళూ అనుమానంబడుతున్నారు. నాకు ఇంట్లోబాధ ఎక్కువైపోతూంది.'

'అయితే యిప్పుడు ఏంచేద్దాం?'

'నీతోనన్ను తీసుకుపోలేకపోతే నేను ఏనుయ్యో, గొయ్యో చూసుకుంటాను. ఇన్నాళ్ళూ నాతో అన్నమాటలు మరిచిపోయావుగాబోలు?'

మారిగాడు గౌరిని వక్షానికి అదుముకుని 'గౌరీ! నాప్రాణం నీతోటేఉంది. నువ్వు సస్తే నేనూసస్తాను. మరి నాలుగురోజులు ఆగు. డబ్బుచూసుకుని పోదాం. డబ్బులేకపోతే రేపే మనం పట్టుబడిపోతాం. అప్పుడు మరీ బాధగా ఉంటుంది' అన్నాడు.

'మరి నేనింటికెళ్ళదలుసుకోలేదు.' గౌరికంఠం గద్గదికమైపోయింది. దాని కళ్ళనుండి జారిన వేడినీటి చుక్కలు మారిగాడి వక్షస్థలాన్ని తడుపుతున్నాయి. ఇంకా దగ్గిరగా తీసుకుని వాడు దానికి కొంచెంధైర్యం చెప్పాడు. చివరకి గౌరి 'సస్తే యిద్దరంసచ్చిపోదాం, రా. నీతో సావే నాకు మేలు.' అన్నాది.

ఇంతలో గట్టుమీద మాటలసడి వినబడ్డాది. తొందరగా వాళ్ళిద్దరూలేచారు. గట్టుపొడుగునా నాలుగునిలువుల ఎత్తుని రెల్లుదుబ్బులు బాగా పెరిగిఉన్నాయి. అందులో దూరిన మనిషిని పట్టపగలే వెతుక్కోవడం కష్టం. అంత దట్టంగాఉన్నాయి ఆదుబ్బులు.

మారిగాడూ, గౌరీ చప్పున ఆదుబ్బుల్లోకి మాయమైపోయారు. గట్టుమీద మాట్లాడు తూఉన్న మనుష్యులిద్దరూ గడ్డలోదిగి, ఆవలి గట్టుయెక్కి- యెక్కడికో పోయారు- నిశ్శబ్దంతప్ప ఇంక అక్కడ నేమీలేదు-

* * *

రాత్రి తొమ్మిదిగంటలకి మారిగాడూ, గౌరీ యెక్కడికో పారిపోయారని మాలపల్లి అంతా గొల్లుమని పోయింది-

* * *

౬

అసలు మొదట్లో మారిగాణ్నేగాని ఇతరులను పెళ్లాడనని తల్లితోచెప్పింది గౌరి- కాని అన్నగారికి కోపంవస్తుందనే కారణంచేత దానితండ్రి అందుకంగీకరించలేదు- చివరకి తాను మనసారా ప్రేమించిన మారిగాడికి సమీపంలోనైనా ఉండవచ్చునుకదా అని గౌరి విధిలేక బాపణ్ని వివాహమాడ్డానికి ఒప్పుకుంది-

బాపడి పొలంపక్కనే పెద్దకాపుపొలంలో మారిగాడు పనిచేస్తూ ఉంటాడు-

ప్రతిరోజూ గౌరి వయ్యారపు నడకలతో బాపడికి చల్దికూడు తెస్తూఉండేది- మారిగాడు ఏతాముకట్టిపెట్టి అలసటతీర్చుకునే మిషమీద గౌరి అక్కడున్నంతసేపూ దానివేపే చూస్తూ కూచునేవాడు-

గౌరితోకూడా మారిగాడిచెల్లెలు రోజూ అన్నకి చల్దికూడు తెచ్చేది- ఒక్కొక్కప్పుడు అది రాకపోతే గౌరే మారిగాడికి కూడా పట్టుకొస్తూఉండేది- అల్లాంటప్పుడు వాడి ఆనందం ఇంతఅని చెప్పతరంకాదు- తన గౌరితో, మనసారా తనదైనగౌరితో అయిదు నిముషాలైనా గడపడం వాడికి బ్రహ్మానందము- అవకాశంకలిగినప్పుడల్లా గౌరి వాడి ఏతాముదగ్గిరకొచ్చి కష్టసుఖాలు చెబుతూ పదినిముషాలు నిలబడేది-

సాయంత్రంవేళ పిడకలూ, కూరకాయలూ, తట్టతో నెత్తిమీగ పెట్టుకుని గౌరి గడ్డదారిని ఇంటికిపోతూ ఉండేది- అది కనిపెట్టి మారిగాడు పనిచాలించి గడ్డఒడ్డున దాన్ని కలుసుకునేవాడు- ఇద్దరూ కొంచెంసేపు కబుర్లుచెప్పుకుని ఎవరిదారిని వారు పోయేవారు.

క్రమంగా వారి ప్రేమలతలు గాఢంగా అల్లుకుపోయాయి- గౌరికి ఇంటిపనిలో శ్రద్ధ తగ్గిపోయింది- పొలంవెళ్ళకుండా ఉండేందుకు మారిగాడి కేదో తలనొప్పి వస్తూ ఉండేది- చివరకు ఒక్క నిముషంకూడా ఒకరి నొకరు వదిలి ఉండలేని స్థితిలోకి దిగింది వారి ప్రేమబంధము-

చుట్టుపక్కల ఆడవాళ్ళలో అనుమానాలు బయలుదేరాయి మొట్టమొదట- ఈఅనుమానాలు క్రమంగా దృఢపడ్డాయి. చాటుచాటుగా యీసంగతి ముచ్చటగా చెప్పుకోవడం ప్రారంభమయింది- స్త్రీలలో నిలవక యీ రహస్యం పురుషుల్లోకికూడా పాకిపోయింది- మారిగాడి స్నేహితులు 'ఏరా! మరదలితో సరసంచేస్తున్నావటగాదంట్రా?' అని పరిహాసంచేసేవారు-

ఆనోటా, ఆనోటా గౌరి అత్తగారివరకూ వెళ్ళింది ఈకబురు- దానికికూడా అనుమానం దృఢపడిపోయింది- ప్రపంచకంఅంతా మారిగాడే అయిపోయినగౌరికి, ఇతరులు తన్ను కనిపెడుతున్నారేమో అన్న ఆలోచనేలేదు- ఏవిధాన్నయినా మారిగాడు సంతోషిస్తే చాలు దానికి- వాడికోసం అగ్గిలో దుముక

డానికి కూడా సిద్ధమే–

వాడు ఇంట్లో ఉన్నంతసేపూ అదియేదో పనికల్పించుకుని తరుచు మారిగాడియింట్లోనే ఉండేది– వీధిలో వాడిమాటవినబడితే చాలు, లోపల ఎంతపనిఉన్నా ఒకసారి పైకి వచ్చి వాడిముఖాన్నిచూస్తేకాని ఉండ లేక పోయేది గౌరి–

ఇలాంటి రహస్యపుజీవనం క్రమంగా సాగిందికాదు దానికి– బాపడికి కూడుపట్టుకెళ్ళడం దానిచేత మానిపించేశారు– మారిగాడికి కూడా యీస్థితి కష్టంగానే ఉండేది– ఒక్కొక్కసారి రెండుమూడు రోజులు గౌరిని చూడ్డానికేనా వాడికి వీలుకలిగేదికాదు–

చివరకి గౌరి తెగించేసింది– ప్రేమలేని కాపురం దానికి దుర్భరమైపోయింది– సాయంత్రం అది యిల్లుబైలుదేరింది– గెడ్డలో మారిగాడూ అదీకలిసి రెల్లుదుబ్బుల్లోకి మాయమైపోయారు– మాలపల్లి లో గలభా పుట్టింది–

* * *

ఆతెల్లవార్లూ వాళ్ళకోసం అందరూ నాలుగుమూలలా వెతికారు. ఎక్కడా జాడ దొరకలేదు. స్నేహితులకందరికీ మారిగాడు లేకపోవడం చెయ్యివిరుచుకున్నట్లుంది. పెద్దకాపు కొడుకు వాడికోసం చాలా విచారించాడు. 'అంతగా కావాలంటే దాన్ని కట్టుకోగూడదంట్రా?' అని పెద్దకాపు స్వయంగా మారిగాడి తండ్రితో అన్నాడు.

## ౭

రెండురోజులు గడిచాయి. మూడోనాడు తెల్లతెల్లవారుతూంది. తొలికోడికూతికి లేచి గ్రామకరణం బుచ్చిరాజుగారు 'గజేంద్రమోక్షము'లో పద్యాలు పక్కమీదే పడుకుని పారాయణచేస్తున్నాడు. వ్యవసాయదారులు పొలంపనికి పోతున్నారు.

పెద్దకాపు పాలికాపుల్నందర్నీ లేపి 'పోగాకు పాకలకి దుబ్బుగొయ్యాలంట్రా' అని పని పురమాయించాడు.

కొడవళ్ళూ, తాళ్ళూ పట్టుకుని పాలికాపులు గెడ్డలోఉన్న దుబ్బులు కొయ్యడానికి పోయారు. కొందరు కోస్తున్నారు. కొందరు కోసినదుబ్బుని మోపులుగట్టి ఊళ్ళోపడేసి వస్తున్నారు.

బాగా తెల్లవారిపోయింది. హఠాత్తుగా ముందుదుబ్బు కోస్తున్నవాళ్ళలో గలభా బయలుదేరింది. 'మారిగాడ్రోయి, మారిగాడ్రోయి' అని కేకలు తక్షణం వినవచ్చాయి. వెంటనే మిగిలిన వాళ్ళంతా పనిచాలించి అటువేపు పరుగెత్తారు.

గెడ్డఒడ్డున, అదట్టమైన దుబ్బుల మధ్య నిజంగా మారిగాడు పడిఉన్నాడు. వాడికి సమీపంలోనే గౌరికూడా పడుకొని ఉన్నది. పాలికాపులందరూ మారిగాణ్ని లేపడానికి ప్రయత్నించారు. వాడు తిరిగీ కనబడ్డం వాళ్ళకి ఎంతో సంతోషంగాఉంది.

మారిగాడికళ్లు మెల్లిగా తెరవబడ్డాయి కొంతసేపటికి. వాడిహృదయం అతి నీరసంగా కొట్టుకుంటూంది. కడుపు లోతుగా దించుకుపోయి ఆహారంలేమిని సూచిస్తూంది. గౌరి శుష్కించిపోయి ఉంది. దానికి శరీరమ్మీద స్మారకమేలేదు. కడచిన రెండురోజులనించీ ఆహారమేలేనట్లుంది వాళ్ళవైఖరి.

అది గ్రహించినవెంటనే వేడిగంజికోసమని ఇద్దరు ఊళ్ళోకి పరుగెత్తారు. అరణ్యంలో అగ్నివలె యీవార్త గ్రామంలో వ్యాపించి

పోయింది. క్షణంలో ఊళ్ళోవాళ్ళంతా గెడ్డ ఒడ్డుకి చేరిపోయారు.

ఆ ప్రేమైకజీవనులను చూసినవాళ్ళందరికీ హృదయాలు కరిగిపోయాయి. సునిశ్చలప్రేమా, అమాయకత్వమూ వాళ్ళముఖాలయందు సువ్యక్తమవుతున్నాయి. రెండురోజుల నించీ తిండిలేనందుచేత శుష్కించిపోయిన వాళ్ళశరీరాల్లో ఒకదివ్యతేజము గోచరిస్తూంది. 'నిర్మలప్రేమవాహినిని అడ్డుపెట్టగలశక్తి పుట్టలేదు—— పుట్టబోదు' అని గంభీరంగా వాళ్ళ ముఖలక్షణాలు చాటి చెబుతున్నాయి. అక్కడికొచ్చిన ప్రతివాళ్ళ నేత్రాలూ అశ్రుపూరితములైనాయి.

ఇంతలో 'పెద్దకాపుగారొస్తున్నారు' అని ఒకధ్వని బయలుదేరింది. కొడుకుతోకూడా వచ్చాడు పెద్దకాపు వీరాస్వామి. గౌరికీ మారిగాడికీ ఇంత వెచ్చనిగంజి పోయించాడు. రెండుమూడు గుక్కలు దిగినప్పటికీ గౌరికి తెలివిరాలేదు. మారిగాడుమాత్రం కొంచెం సేదదేరాడు. పక్కనేఉన్న గౌరిస్థితి చూసేసరికి వాడికి కన్నీళ్లు ప్రవాహంగా వచ్చేశాయి. వీరాస్వామి పాదాలకి వాడు నమస్కారంచేశాడు.

పెద్దకాపు సవారీచేయించి తక్షణం గౌరిని తనయింటికి తీసుకుపోయినాడు. మారిగాడుకూడా పెద్దకాపుతో అతని యింటికే వెళ్లాడు.

వీరాస్వామియింటి పడమటివసారాలో సవారీ దింపారు. గౌరి తలిదండ్రులూ, మారిగాడూ దానికి ఉపచారాలు చేస్తున్నారు. పెద్దకాపు భార్య సీతమ్మ గౌరికి దగ్గిరగా కూచుని అన్నిసదుపాయాలూ స్వయంగా చూస్తూంది.

రమారమి పదకొండుగంటలకి గౌరికి తెలివివచ్చింది. మాట్లాడ్డానికి తగినశక్తిమాత్రం లేదు. దీనదృష్టులతో మారిగాడివేపు చూస్తూ, వాడిబుజంమీద చెయ్యివేసుకుని అలాగే పడుకుంది.

సాయంకాలానికి గౌరి కొంచెం సేదదేరింది. లేచి మెల్లిగా నడవగలశక్తి దానికి కలిగింది.

ఆమర్నాడే పెద్దకాపు అనుమతిపైని గౌరిని దాని తలిదండ్రులు బండీమీద వాళ్ళ ఊరు తీసుకుపోయారు. అనుకూలదాంపత్యం కానప్పుడూ, దానికి యిష్టంలేనప్పుడూ గౌరిని విడిచిపెట్టడం మంచిదని అందరూ బాపడికి బోధపరిచారు.

పెద్దకాపుకూడా ఈవిషయంలో కలగచేసుకుని బాపడికి తగినమోస్తరుగా ఆలోచన చెప్పాడు. బాపడు పరిస్థితులన్నీ చూసి పెద్దకాపుచెప్పినట్లూ ఒప్పుకుని గౌరితో తన వివాహాన్ని రద్దుచేసుకున్నాడు.

మరి నెలరోజులకి గూడెంలో మంచి ముహూర్తాన్ని మారిగాడికీ, గౌరికీ సక్రమంగా వివాహం జరిగిపోయింది.

ఇప్పుడు వాళ్ళిద్దరూ సౌఖ్యసామ్రాజ్యాధిదేవతలు——ప్రపంచంలో విడదీయరాని స్నేహితులు——జీవితయాత్రయందు సమానభాగస్వాములు.



# ఆమె ఒక జాతి మనిషి

రచయిత:

ఆకుండి సత్యనారాయణ

## ౧

మధ్యాహ్నం మూడుగంట లయింది. విశ్వనాథం అప్పుడే మేలుకుని గదివెలుపలకు వచ్చాడు—విశాలం కనబడలేదు. ఆరవేసినబట్టలు తీసుకుని వచ్చుటకుగాను పెరట్లోకి వెళ్లిఉంటుందా? తొందరగా పెరట్లోకి వెళ్లి 'విశాలం! విశాలం' అని కేకవేశాడు. జబాబు రాలేదు. తిరిగి లోనికి వచ్చి యింటినాలుగుమూలలా పరికించాడు. ఎక్కడా ఆమెజాడ లేదు- ఏమిటిది? తనకు కచ్చేరీకి వేళవుతూంది... విశాలం ఇంట్లోలేదు? రాముడమ్మగారింటికి వెళ్ళింది కాబోలు!— అంతే- ఇం కెక్కడికి వెళ్లుతుంది?

చరచరా పొరుగునేఉన్న రాముడమ్మగారింటికి వెళ్ళి వీధిగుమ్మంలో నిలిచి కిటికీసందుగుండా గదిలోనికి చూశాడు- లోన విశాలం గోచరించింది- విశాలం, రాముడమ్మ— పక్కను అబ్బాయికూడా ఉన్నాడు!

విశాలం— ఆమె అంతచొరవ తీసుకుంటుందని ఎవ రనుకుంటారు?— ఆమె వారితో ఎంతఉల్లాసంగా చీట్లాడుతూంది! ఆకూర్చొడంతీరు, ఆమెఉత్సాహం, ఆకళ్లలోనివెలుగు — అతడు నిర్ఘాంతపోయాడు.

అబ్బాయి నెమ్మదిగా అడుగుతున్నాడు ... ఆమెనే!

'మీాఆయన ఇంట్లో ఉన్నాడా? ఆఫీసుకు వెళ్లాడా?'

ఆమె ఉత్సాహంతో జబాబిస్తూంది:

'ఇవాళ శలవుకదూ? ఇంట్లోనే ఉన్నారు.'

'ఏం జేస్తున్నాడు?'

'పడుకున్నారు.'

'ఇంకా పడకే!—రాత్రల్లానిద్రపట్టనివ్వకుండా చంపేవుకాబోలు!' అన్నా డబ్బాయి నవ్వుతూ.

ఆమె ముఖ మొక్కసారి కెంపుబారింది; రోషంతో అంది:

'అబ్బ; పోదూ— ఎప్పుడూ యిలాంటి మాటలేనూ—'

రోషంలోకూడా ఆమె ముఖంలోనూ, మాటల్లోనూ ఎంతఅందం? ఎంతమాధుర్యం? —— చక్కనివాళ్లకు రోషంకూడా అనోమాదిరి అందమే ఇస్తుంది-

నిజంగా అప్పుడామెమనసులో నున్నది రోషమో, సంతోషమో ఎవరు చెప్పగలరు?

అయినా ఆమెపలుకులు మధురమైనగానంవలె అబ్బాయి చెవినిసోకి, అతనిశరీరం పులకలెత్తించి, అమూల్యమైన ఆనందపారవశ్యంలో అతణ్ణి ముంచెత్తేయి- కాని... ఎందుచాతనో ఆపలుకులే విశ్వనాథంచెవులబడి పదునైనశూలములవలె అతనిహృదయంలోనుంచి దూసుకుపోయాయి... ఒకరి ఆనందం కొరకుగాను ఇంకొకరు దుఃఖపడవలసిఉండడం ప్రపంచధర్మం కాబోలు!

విశ్వనాథం నెమ్మదిగా వారిని సమీపించాడు- విశాలం ముఖమెత్తి అతనివంకచూసి ఒక్కసారి గతుక్కుమంది- ఆమెలోని ఆనందమంతా, జీవమంతా హఠాత్తుగా ఎక్కడికో ఎగిరిపోయి నట్లయింది- చేతిలోని పేకముక్కలు మెల్లగా పక్కనుఉంచి వెనక్కుజరిగి నిర్జీవప్రతిమవలెగోడ నానుకుపోయింది-

'ఇక్కడా కూర్చున్నావు? అరగంటాయి చూస్తున్నాను ఎప్పటికైనా వస్తావేమో అని' అంటూ విశ్వనాథం తిరుగుముఖమైనాడు-

కూర్చోవోయి' శలవుపూటేకదా? సరదాగా రెండాటలు వేసుకుందాము' అంటున్నాడబ్బాయి-

అత డాగకుండానే 'వెళ్లాలోయి! తొందరగా ఆఫీసుపని తగిలింది' అంటూ ఇంటివైపు మళ్లేడు-

విశాలంకూడా చప్పునలేచి నూనెసీసా, దువ్వెనా చేతబుచ్చుకుని అతణ్ణి అనుసరించింది- ముందు భర్తా, వెనకభార్యా... ఇరువురూ ఇల్లుచేరారు-

విశాలం తనప్రవర్తనను ఎలాగో సమర్థించుకోవాలి; అవకాశం నిరీక్షిస్తూంది-

భర్త తొందరగా ముఖం రుద్దుకుని, షర్టూ, ఉత్తరీయం వేసుకుని రికార్డు చేతబుచ్చుకుని ఆఫీసుకు బయల్దేరేప్రయత్నంలో ఉన్నాడు—— విశాలానికి మంచిఅవకాశం చిక్కింది-

'ఇవాళ శలవుకదా? ఎక్కడికప్పుడే బయల్దేరుతున్నారు?' అని నెమ్మదిగా అడిగింది-

అతడు కొంచెంతీక్ష్ణంగా 'ఆఫీసుకు వెళ్లాలి- చెక్కుమార్చేందుకని అర్జంటుగా కబురువచ్చింది' అని చెప్పి వెళ్లిపోబోతున్నాడు-

విశాలం కలవరపడ్డది-

'అదేమిటి? కాఫీ తీసుకోకుండా బయల్దేరడ మేమిటి? నాకు తెలిసిందికాదు- శలవుపూటకదా తొందరలేదేమోనని జడవేసుకుందికని వారింటికి వెళ్లి, ఇంకా పడుకున్నారు కదా అని ఒక్కక్షణం అలా కూర్చుండిపోయాను- ఏముంది? ఒక్కక్షణంలో అయిపోతుంది- కాఫీ తీసుకుని వెళ్లండి!' అంది నెమ్మదిగా-

అతడు కొంచెం మెత్తబడి కుర్చీలో చతికిలబడ్డాడు-

విశాలం చప్పునలేచి చేతిలోని నూనెసీసా- దువ్వెనా అలమారులో ఉంచింది—— తను కేవలం రాముడమ్మగారింటికి జడవేసుకుందికే వెళ్లినట్లు తోపించాలని కాబోలు! గబగబా కాఫీపొయ్యి అంటించింది- ఆలస్యంచేసినందుకు పాపం తనలో తనే ఎంతో విసుక్కుంది- ఆమెమాటలూ, చేష్టలూ గమనిస్తూఉంటే భర్తను మెల్లగా మరపించేందుకని... ఏదో కానిపనిచేసి దానిని కమ్ముకుందికని... ప్రయత్నిస్తున్నట్లు స్పష్టంగా కనబడుతూంది-

కాని విశ్వనాథం అంతసులువుగా మళ్లింపబడేవాడు కాడు- ఆమె తనప్రవర్తనకు పశ్చాత్తాపంతో, దుఃఖంతో హృదయపూర్వకంగా తపనపడాలని అతని అభిలాష- తనని మరిపించాలని ఆమెచేస్తున్న ఈప్రయత్నంకంటె, ఈనటనకంటె అదే ఎంతోనయమని అతనిఉద్దేశం- అబ్బాయికి... పరపురుషునికి... అంతచేరువగా కూర్చుని, అంతచనువుగా, నిస్సంకోచంగా అతనితో చీట్లాడుతున్నప్పుడు హఠాత్తుగా తను కంటబడేసరికి ఆమె ఒక్కసారి ఉలికిపడ్డమాట, సిగ్గిలినమాట నిజమే- కాని అవి ఆమెహృదయంలో ఎటు

వంటిపరివర్తనమూ కలిగించలేనప్పుడు ఆసిగ్గు, ఉలికిపాటు... వాటివల్ల ఏం ప్రయోజనం?

విశాలం త్వరగా కాఫీతయారుచేసి నెమ్మదిగా భర్తముందుంచింది- అతడు కాఫీ పుచ్చుకుంటున్నసమయాన చనువుగా ఒకటి రెండుసార్లు మాట్లాడాలనికూడా ప్రయత్నించింది- కాని అత డేమీజబాబు చెప్పలేదు; ఉత్సాహం కనబరచలేదు- తొందరగా కాఫీ తీసుకుని, ఆమెవంక ముఖమైనా తిప్పకుండా చటాలున కదిలిపోయాడు- అతనిమనస్సెందుకో తీవ్రంగా బాధపడు తున్నట్లుంది- అయినా అతడు దానిని లోలోపునే దిగమింగుతున్నాడు. కాని పైకేమాత్రము వెలిబుచ్చలేదు-

ఆమరుచటిదినంకూడా అతడు ఏదో కొంచెం కోపంగానే, ఎరసుగానే ఉన్నాడు- కాని ఆరెండోనాటికి అతనికోపంబిగి కొంచెం తగ్గినది- ఇంకా దినములు గడుస్తున్నకొద్దీ నాలుగైదుదినములు జరిగేసరికి ఆనాటిసంఘటనయొక్కస్మృతే అతనిమనసులో నుంచి పూర్తిగా తుడుచుకు పోయింది—కాలం ఎన్నిటినో మరిపించగలదు; పైగా తరుణులయందలి మోహం—అందులోనూ యౌవనాతిశయంతో పొంగిపోతూ, నిండుబలంతోనూ, ఆరోగ్యంతోనూ తులతూగుతున్న తరుణులయందలిమోహం—, వారివలపు ఎంతటి విచారకరమైన దెబ్బనైనా క్షణంలో బాగుచేయగలదు. విశ్వనాథంబాధ ఉండవలసినంతగా ఇప్పుడు లేదు.

ఇంతకూ తను నిజంగా ద్రోహంచేయబడ్డట్టుకూడా అతనికి విశ్వాసంలేదు. పైగా అతని కింకా ఆలోచించవలసిన ముఖ్యమైన విషయా లెన్నో ఉన్నాయి. కొద్దిరోజులలోపునే అతడు ప్రమోషనుకోసం ఎదురుచూస్తున్నాడు. అందుకని కట్టలుకట్టలుగ ఎదుట పడిఉన్న రికార్డులతో అతడు అహర్నిశలు కొట్టుకుపోతున్నాడు. ఒక్కొక్కసమయంలో అతనికి భోజనానికికూడా సరిగా వ్యవధిచిక్కదు. అతడు ఏకాగ్రచిత్తుడు. అనేకవిషయాలనుగురించి ఒకేసారి ఆలోచించగలశక్తి అతనిలో లేదు.

౨

విశాలం పరిపూర్ణమైన యౌవనాతిశయంతో తొణుకులాడుతూంది. ఆమె యౌవనాతిశయం ఆమె చీరముడుతల్లోనుంచి, బుజాల వంపుల్లోనుంచి, ' సన్ననిపైటతెరయెత్తులోనుంచి, పదములకదలికలోనుంచి, ఆమె ప్రతి అవయవంలోనుంచీ పొంగి ప్రవహించిపోతున్నదా అనిపిస్తూ ఉంటుంది.

అందమా ? ఓ ! అమితమైనఅందం. మెత్తని పట్టుపోగులవలె నుదిటిమీదకు జారుతున్న నల్లనిముంగురులకాంతులను ప్రతిఫలింపజేస్తున్న ఆనీలాలవంటి కళ్ళూ, ఆవిశాలమైన కనుపాపలనీడలను ప్రతిఫలింపజేస్తున్న ఆ వెన్నెల చంపలూ, తెలిమొగలిపొరవంటి నున్నని, స్వచ్ఛమైన ఆతనుకాంతి సాటిలేని ఆమెఅందాన్ని చాటుతూ ఉంటాయి.

ఒక్కొక్కసమయాన ఆకళ్లు వెలిగేయంటే—ఆ పెదవులపైని చిరునవ్వు మెరసిందంటే వాటికిసామ్యం నీలిమబ్బుల్లోమెరిసే ఏవిద్యుల్లాలికలోనూ, అరవిచ్చిన ఏగులాబిలోనూ ఎక్కడా, ఎంతవెతికినా కనబడదు.

ఆకళ్ళనుంచి ప్రసరించిన ఒక్కచూపు చాలును—మధురమైన ముద్దుకంటె తీవ్రంగా పురుషులహృదయాలను కలవరబరచి మత్తెక్కించడానికి.

ఆమె కంఠస్వరం—అది కోయిలస్వరం

కాదు, వీణ(మోతకాదు. ఆరెండిటినీమించిన ఏదో అపూర్వమైన, దివ్యమైన మాధుర్యం అందులో ఉంది. ఆమె నోటమ్మట ఒక్క మాట వెలువడ్డదంటే అమృతకిరణంవలె హృదయాంతరాళంలోనుంచి దూసుకుపో తుంది—ఆమె వయస్సు పదహారుసంవత్సర ములలోపు. ఆమె కాపరానికివచ్చి నిండారా రెండుసంవత్సరములు కాలేదు.

మొదట్లో భార్యాభర్తలు చాలా అనుకూలంగాఉండి ఒకర్నొకరు ఒక్క క్షణమైనా విడువజాలకుండా ఉండేవారు. ఇప్పుడైనా వారికి అన్యోన్యత లేదని చెప్పలేము. అప్పుడప్పుడు వార్లోవారికి భేదాభిప్రాయాలు కలుగవచ్చును—భార్యాభర్తలన్నతరువాత ఆమాత్రం లేకుండా ఎవరికుంటాయి?

అయినా వారెన్నడూ దెబ్బలాడుకోరు. విశ్వనాథానికి దెబ్బలాడగలనేర్పు లేదు. అతని కెన్నడూ కోపం రానేరాదు. ఒకవేళ ఎప్పుడైనా కొంచెం కోపం వచ్చినా దానిని నెమ్మదిగా సరిపుచ్చి, అతణ్ణి వెంటనే శాంతింప జేయగలనేర్పు విశాలంలో చాలాఉంది; పైగా విశాలమంటే భర్తకు అమితమైన ఆపేక్ష—ఎన్నోవిధాల ఆమె కతడు తగినవరుడని చెప్పాలి.

అయితే ఇప్పుడిప్పుడు కొన్నికొన్నిసమయాల్లో కొంచెం అలసటచెందినచిహ్నాలు అతనిలో పొడగట్టవచ్చును. కాని అదంత పెద్ద లోపంగా ఎంచవలసిందికాదు. గడచినశరత్కాలంలో తొల్లింటివలెనే అతడు తనసహజమైన ఆరోగ్యంతోనూ, బలంతోనూ ఆమెను సంతృప్తిపరచిన సమయాలెన్నో ఉన్నాయి.

కాని ప్రత్యేకంగా చెప్పుకోతగ్గ గొప్పతనం గాని, అందం కాని ఏమేనా అతనిలో ఉందా అంటే లేదనే ఒప్పుకోవాలి. అక్కడే ఆమెకు కొంచెం అసంతుష్టిగానూ, ఏదో వెలితిగానూ ఉన్నట్టు తోచేది.

మొదట్లో ఆమె కేమీ తెలీకపోయినా అబ్బాయితో పరిచయం లభించిందిమొదలు అతనిలోనూ, అతనిగుండానూ అందమంటే ఏమిటో, నాగరికతఅంటే ఏమిటో ఆమె పూర్తిగా అర్థంచేసుకోగలిగింది. నాజూకు, రసికతా ఎరిగిన ఎంతోమందితో ఆమెకు పరిచయం కలిగింది. వారితో పోల్చిచూసి నప్పుడు—వారిముందు తనభర్త ఎంతలోకువో ఆమెకు బాగా తెలుసు. ఆలోకువతనంలోనే అతణ్ణి చూసేది. అలాచూడడంలో అధర్మం గాని, అగౌరవంగాని ఈషత్తూ లేదని ఆమె విశ్వాసం—అవును; అతని కంతకంటె అర్హత లేనప్పుడు తనేంజేస్తుంది? ఇప్పటి జ్ఞానమే మొదట్లో ఆమె కుండేమాటుంటే అతణ్ణెంత మాత్రం వివాహం చేసుకునిఉండదు. అది నిశ్చయం.

మనస్సులో ఇంతవేగం మార్పెలా వస్తుందో ఆశ్చర్యకరమైనవిషయం. భర్త పరిహాసంగా మాట్లాడుతున్నప్పుడు ఆమాటల్లో విశాలాని కిప్పుడు ఆనందం కలుగలేదు. పైగా అతనిమాటలు కొంచెం వెగటుగాను, మోటుగాను, అనాగరికంగాను ఆమెకు వినబడుతున్నాయి. ఎందుచాత? సున్నితమైన, నాజూకైన పరిహాసం ఎలాఉంటుందో దాని పరిమళం ఆమె బాగాఅనుభవించింది. ఇంతవరకూ అతనిమాటలు ఎందుకు బాగున్నాయి? ఇంతవరకు ఆమె కేమీ తెలీదుగనుక-ఇంతవరకూ ఆమె మనస్సుకి మబ్బుకమ్మింది. ఇప్పుడామబ్బు వీడిపోయింది. క్రమంగా ఆమె మాటల్లోకూడా పూర్వపు దివ్యమైన, అమా

యకమైన ఆమాధుర్యము, ఆసరళతా పూర్తిగా మాయమైనాయి.

ఇప్పుడు భర్తను భోజనానికి లెమ్మనవలసివస్తే 'వంటయింది; స్నానం చెయ్యవచ్చును' అని వంటింటిగుమ్మంలోనుంచే కేక వేస్తుంది. అ దంతయింపుగా వినబడదు. 'వస్తే రావచ్చును లేకుంటే మానీవచ్చును' అన్న నిర్లక్ష్యభావం అందులో ధ్వనిస్తూఉంటుంది. ఏమిటిది ? పూర్వం ఎన్నడూ ఇలా లేదే! నెమ్మదిగా సమీపానికి వచ్చి 'వంటయింది; స్నానానికి నీళ్లు తోలపనా?' అని చిరునవ్వుతో ఎంతో మృదువుగా అడిగేది—అతడు అమితమైన అనురాగంతో 'ఓ' దేవిగారి అనుగ్రహం ఎప్పుడువస్తుందో అని నిరీక్షిస్తున్నాము' అని వెంటనే స్నానానికి లేచేవాడు.

పూర్వం అతడు కచ్చేరీకి వెళుతూన్నసమయాన అతణ్ణి వొదలలేక వీధిగుమ్మంవరకూ అతణ్ణి అనుసరించి, మళుపు తిరిగేవరకూ, చూపుకందేవరకూ అతనివంక చూస్తూ అలా ఉండిపోయేది—ఇప్పుడు ? అతడు కచ్చేరీకి వెళుతూఉంటే ఏ వంటింట్లోనో, గదిలోనో కూర్చుని తనపనిని చూసుకుంటూ వెలుపలికి రానేరాదు. ఆమెసంగతిప్పుడంతా భేదంగానే ఉంది అన్నిటిలోనూ భేదమే !

ఇప్పుడైనా వారి దంతపొందికలేని జీవితమని చెప్పేందుకు ఎంతమాత్రము వీలులేదు. అలా భావించడం చాలాపొరపాటుకూడాను. అప్పుడప్పుడు—ఆమెమనసు ఆమెవశం తప్పినప్పుడు—ఆమె కొంచెం మితిమీరి ప్రవర్తించవచ్చును. అటువంటిసమయంలో ఆమె ప్రవర్తన ఏమీ బాగుండలేదని అతనిమనసుకి తట్టవచ్చును. అప్పుడైనా అతడు ఒక్క దెబ్బ కాదు—పల్లెత్తుమాటయినా ఆమె ననడు. ఒక్కసారి ఆమెవంక తీక్ష్ణంగా చూస్తాడు. కొద్దిగా గాంభీర్యం వహిస్తాడు. అంతే.

అతని కోపకారణం వెంటనే ఆమె గ్రహిస్తుంది. తత్క్షణమే తనమనసుని నూతనమార్గాలనుంచి, వేషాలనుంచి మళ్ళించుకుని తొల్లింటివలెనే ఎంతో మర్యాదగా, ఉచితంగా, భర్తసంరక్షణవిషయంలో ఎంతో జాగ్రత్తగా మసులుకుంటుంది. వెంటనే అతని చూపుల్లోని తీక్ష్ణతా, ముఖంలోని గాంభీర్యమూ మాయమై వాటిస్థానంలో ఎప్పటివలెనే ప్రేమా, కృతజ్ఞతా తాండవిస్తాయి. తిరిగి వారిరువురిమధ్యా వోరచూపులూ, చిరునవ్వులూ, కౌగిలింతలూ అన్నీ మునుపటివలెనే సాగుతూఉంటాయి—కష్టం, సుఖం, సంతోషం, దుఃఖం, మంచీ, చెడ్డా సంసారమన్నతరువాత నాలుగురఖాలగానూ ఉంటుంది.

[సశేషము.]

# తిరస్కృత ప్రణయిని తిష్యరక్ష

(ఏకాంక వచన నాటిక.)

[తిష్యరక్ష అశోకమహారాజు రెండో భార్య. ఆమె తనసవతికొడుకైన కుణాలుణ్ణి వలచింది. అశోకమహారాజేర్పాటుచేసిన బౌద్ధనాటకప్రదర్శనంలో కుణాలుడిభార్య కాంచనమాలను వంచించి, ఆమె పుష్పాలంకారాలపహరించి, ఆమెను ప్రదర్శనంలో లేకుండాచేసి తనే అతనిప్రక్కను రతీపాత్ర నభినయించింది. ప్రదర్శనం అయిన తరువాత అతనికి వంచనచే కబురంపి పూవుటీరంలో కనిపెట్టుకుంది. ఈనాటకం ఈసందర్భం తరువాతిది.]

---


రచయిత :

పాలెపు వెంకటరత్నము


---

రంగము : ఉద్యానవనములోని యొక లతాగృహము.

[ప్రవేశము : తిష్యరక్ష ఆలోచిస్తూ. లతాగృహమంతా సుగంధద్రవ్యమయం. చారకాల భక్ష్యాలు వెండితబుకులలో అమర్చబడిఉంటాయి. ఒత్తుగాపూసిన ఆకులు లేని పూలకొమ్మ చంద్రకాంతశిలా వేదికమీద శయ్యగా ఉంటుంది. వెండిచెంబులలో పన్నీ కాచపాత్రల్లో అత్తర్లూ ఉంటాయి. పైన చాదినీలాగ తెల్లపువ్వులతో ఉన్న పచ్చని దట్టంగా అల్లుకుని ఉంటుంది. సందుల్లోనుంచి చంద్రకిరణాలు లోపలికిపడుతూ ఉంటా తిష్యరక్ష శరీరం నిండా పువ్వులదండలతో అలంకరించుకొని ఉంటుంది.]

తిష్యరక్ష :

మనస్సు పరిపరివిధాల పోతోంది. ఏం చెయ్యడానికీ తోచడంలేదు. నవయౌవనంలో ఉన్న నేను ఆముసలి అశోకుడితో కాపురంచెయ్యడం దుర్భరంగా ఉంది. ఉద్రేకపూరితమై కాగుతూఉండే పాలలాటిది నా వయస్సు. ఆతడిదో చల్లారిపోయి ఏమాత్రమూ వేడిలేని పాలలాటిది. ఎలాకుదురుతుంది దానికీ, దీనికీ? కానీ. ఉపాయం ఆలోచించనే ఆలోచించాను. ఒళ్లు ఝల్లుమంటోంది, ఆతణ్ణి తలుచుకుంటే. నవయౌవ్వనసంపన్నుడు, నిరుపమానసుందరుడు, ధీరాతిధీరుడు, కుణాలుడు. నాలుగక్షరాలు. యెంతతియ్యగా ఉన్నాయి. ఏవీ మళ్ళీ కు-ణా-లు- ఏమో ? చీకటిగాఉండే మనస్సులోకి చం కాప్రసారం అయింది. ఎండి బీటలువా హృదయంమీద అమృతరసం ప్రవహించిం కుణాలుడు—ఏమిటో పిచ్చిలోకం—కొడు టారు. కొడుకేమిటి? ఆత డేం నాకడుపు పుట్టాడా ? కొడుకే అయితే అతన్ని త కోడంతోటే నాశరీరం ఎందు కిలా పుల స్తుంది? ఆతన్ని భావించుకోడంతోటే చిత్తమంతా యెందుకిలా కామోద్రేకపు తం అవుతుంది. అంతరాత్మను ఉద్రేకింప

పని ఏదీ పాపంకాదు. సరికదా అలాంటిపని చేయకపోవడమే పాపం. చంద్రకిరణాలకీ కలువకీ, మల్లెపువ్వుకీ తుమ్మెదకీ, మేఘానికీ నెమలికీ ఉండే సంబంధంలాటిదేదో నాకూ అతనికీ మధ్యనుంది. అది నెరవేరకపోవడం మహాపాపం. కాని పాపం ఆతను కేవలం అమాయికుడులా కనపడతాడు. ఆతని భార్యను వంచించి ఆరంగస్థలంలో, అవకుంఠనవతినై, అతనిప్రక్కను రతీపాత్ర నభినయిస్తే బెదరిబెదరి చూచాడు. కాని పాపం నిజం కనుక్కో లేక పోయాడు. ఆతడు నన్ను 'కలికీ!' అని సంబోధించినప్పుడల్లా నామనస్సు స్వర్గవీధుల్లో తిరిగి, పారిజాత కుసుమ సౌరభ మిళిత మందవాయువులచే హాయి చెందింది. కాని— ఆతడిప్పుడు నాకులోబడి నావాంఛతీరుస్తాడా? అందరూ ఆతణ్ణి ధీరుడూ, జితేంద్రియుడూ అంటారే? ఏమో? ఏంజరుగుతుందో? నా మాట విని నాకు లోబడతాడా బాగుపడుతాడు. లేకపోతేనా? (ఆలోచించి) అయ్యో! ఏమంటున్నాను? నావలపుల రాయడికి, నా ప్రేమనిధానానికి, నామోహనాంగుడికి ద్రోహంకల్పిస్తున్నానా? వొద్దు. వొద్దు. చెయ్యను. ముమ్మాటికీ చెయ్యను. ఇంతకీ ఆతనికి వంచనచేత కబురంపానా! ఈపాటికి వొస్తూనే ఉంటాడు. ఏంజరుగుతుందో...(పువ్వులుదండలు గుచ్చుతూఉంటుంది.)

[ప్రవేశము : కుణాలుడు. ఇరవైమూడేళ్లుంటాయి. సమున్నతశరీరం. రాజపుత్రలక్షణాలు. ముఖంలో శాంతభావం, వైరాగ్యం. అప్పుడే నాట్యరంగం దిగివచ్చినట్టుగా ఉంటాడు. ఒంటినిండా పువ్వులదండలు. ఏదో ఆలోచిస్తూ ఉంటాడు.]

కుణాలుడు :

కబురంపారట. ఎవరంటే మీప్రక్కను నటించిన రతీపాత్రధారిణి- మీపుష్పమాలాపహర్త్రి- వెంటనే మిమ్మల్ని చూడాలంటోంది కాన త్వరగా రండని కబురు. దాసీదాన్ని ఇంకా అడగాలంటే నిలబడకుండా ఒకటే పరుగు. కానియ్యి. అసలాపువ్వులదండ లపహరించడంలో వాళ్ళ ఉద్దేశమేమిటో గ్రహించొచ్చు. పాపం, నావెర్రికాంచన ఆపుష్పాలంకారాలు కనుపించక ఎంత చిన్నపుచ్చుకుంది. ఆదిగులుచేత ప్రదర్శనం చూడ్డానికేనా రాలేదు. కాని రతీపాత్రధారిణి యెవరో చాలా చమత్కారంగా నటించింది. ఒక్కసారే ఇరువురి భావాలు ప్రదర్శించింది. సరిగ్గా ఆ పోగొట్టుకున్న పువ్వులదండలే ఆమె వంటిమీదున్నాయి. ఇంతకూ ఆమె ఉద్దేశమేమిటో కనుక్కుంటాను. ఏమైనా అర్ధరాత్రివేళ ఒంటరిగా స్త్రీని కలుసుకోడం అంత మంచిపని కాదు. కాని ధర్మమే నాకు సహాయం. కాంచనని యెప్పుడు కలుసుకుందామా అని ఉంది.

(సమీపిస్తాడు)

[తిష్యరక్ష కళ్ళెత్తి చూస్తుంది. మళ్ళీ చూడనట్టు నటిస్తుంది. ముఖంలో సంతోష విద్యుత్తరంగాలు పరుగులెడుతూ ఉంటాయి.]

తిష్యరక్ష :

వొస్తున్నాడు. వొచ్చేశాడు కూడాను. అమ్మయ్యో! నాగుండె యెంతగట్టిగా కొట్టుకొంటోందో. ఓమనస్సా! నీకెందు కింత తొందర ? నావలలో వేసుకుని అతణ్ణిక్కడకి రప్పించనే రప్పించాను. ఇంక నీకోరిక నెరవేరడం యెంతసేపు ? ఆతనిపేరు తలుచుకుంటేనే చలనంకలిగే నాకు అతనిదర్శనంవల్ల మరీ కంగారుగాఉంది. మాట్లాడ కూరుకుంటాను. ఏమంటాడో ? ఎలా మాట్లాడుతాడో ? తరు

వాత సందర్భానుసారంగా మాట్లాడం నాకు తెలియకపోతేగా ?

కుణాలుడు :

కాంచన పువ్వులదండ లపహరించి, ఈ లతాగృహంలో కూర్చుని అర్ధరాత్రివేళ నాకు కబురంపడంలో మీ ఉద్దేశమేమి టమ్మా?

తిష్యరక్ష :

నన్ను నువ్వు పువ్వులు దొంగిలించావని వేరే దూషించనక్కరలేదు. పువ్వులు కంటికి కనబడేవే. సుకుమారం అయినదీ, కంటికి కనబడనిదీ, అయిన నామనస్సును నువ్వు హరించావే. అదో? దీన్లో యెవరు గొప్పవారు? కుణాలా!

కుణాలుడు :

అమ్మా !

తిష్యరక్ష :

అదే. అదే. అక్కొద్దన్నాను. తెలిసిందా, కుణాలా ? ఇప్పుడైనా తెలుసుకో నే కబురంపిన ఉద్దేశం.

కుణాలుడు :

ఏమీ తెలియడంలేదు. కాక నా చెవుల్ని నేను నమ్మలేకుండా ఉన్నాను. నాతండ్రి అశోకమహారాజు వివాహంచేసుకున్న తిష్యరక్షాదేవి, నాతల్లి ఇల్లా మాట్లాడుతోందంటే నాకు బొత్తిగా అయోమయంగా ఉంది. సరే ఇంక సెలవు.

తిష్యరక్ష :

నిలవోయ్, కుణాలా! చాలామంది చెప్పారిలాటిమాటలు. ఒకటే తొందరపడకు. ఏమన్నావు. నీతండ్రి అశోకమహారాజు నన్ను పెళ్ళిచేసుకున్నాడా ? అందుకని నీకు నేను తల్లినా? వొట్టిది. కుణాలా ! వొట్టిది. అసలు వివాహమంటే యేమిటో తెలుసునా నీకు ? సమానవయస్కులైన ఇరువురు యువతీయువకులను, ప్రేమసూత్రంతో బంధించి, మన్మధబాణాలతో అక్షతలు చల్లుతాడు పరమేశ్వరుడు. అంతేకాని మానవనియమాలకి లోబడి మంత్రాలుచదువుతుంటే పురుషుడు స్త్రీమెడలో సూత్రం ముడేసినంతమాత్రాన పెళ్ళయిపోయిందా ? వొట్టిది కుణాలా. అటువంటి వివాహంచేత నేను చక్రవర్తిభార్యనూ కాను. నీతల్లినీ కాను. ఆనాడు-అంతఃపురాని కొచ్చిన మరునాడు-నీవు గుఱ్ఱంపై వాహ్యాళి వెడుతుంటే గవాక్షంగుండా చూచానే, ఆనాడే పరమేశ్వరుని యాజ్ఞాప్రకారం పవిత్రంగా నిన్ను వివాహంచేసుకున్నాను. నేను రంగస్థలంమీద నోరారా పిలిచాను 'నాధా!' అని. ఇక నన్ను విడనాడకు. నామాట విను.

కుణాలుడు :

అబ్బ ! యెంతచెప్పావమ్మా. ఇంతసేపూ నీదీర్ఘోపన్యాసం వింటూ ఆనందిస్తున్నాననుకుంటున్నావుగావును. ఆపాపపు పలుకులు వింటుంటే యేంచెయ్యడానికీ తోచక అలా స్తంభించిపోయ్యాను కాని. ఆప్యాయంగా వింటూకాదు. సరే నానిశ్చయం విను. పవిత్రమైన బౌద్ధధర్మం స్వీకరించి, ఆధర్మాని కధికారియైన అశోకమహారాజుకి కొడుకునైన నేను- నాకాంచనమాలను తప్ప ఇతర స్త్రీలోకమును తల్లిగా యెంచే నేను నీ అవినీతి మాటలు విని యెన్నడూ నీకు లోబడననుకో. ఎందు కీవ్యర్ధప్రశంస. సెలవియ్యమ్మా, నాకు.

తిష్యరక్ష :

విన్నానుగాని నీ నిశ్చయం కుణాలా ! నీకేమీ ఆలోచనలేదనుకుంటాను. నీవెవరితో మాట్లాడుతున్నావో తెలుసునా? ఈ విపుల

# బార్లీ బియ్యము

రచయిత:

డాక్టర్ ఆండ్ర రంగారావు, యల్. ఐ. యమ్.

బార్లీబియ్యముతో మీకు పరిచయము న్నదా? రోగసమయమున డాక్టరులు విధించు బార్లీనీరు, బార్లీజావ మూలకముగా బార్లీ బియ్యము సాధారముగ అందరి ఎఱుకలోనికిని వచ్చుచున్నవి. వీనిని సంస్కృతమున 'యవలు' అందురు. ఈవ్యాసమున యవలుపెరుగుప్రదేశములు, యవలచరిత్ర, వాని వ్యవసాయవిధానము, వానిని మాసూల్ చేయుపద్ధతి, వాని వైద్యోపయోగము, గృహోపయోగము, పారిశ్రామికోపయోగము, మతోత్సవోపయోగము వివరింప తలపెట్టితిని.

### బార్లీ పెరుగుప్రదేశము

బార్లీ ఏకవార్షికమగు గడ్డిదుబ్బు. మనవరికి వలెనే ఇదియు ఒకదుబ్బునకు పెక్కు దంటులను పెట్టును. ఇవి రెండుమొదలు మూడుఅడుగుల పొడుగునకు ఎదుగును. ప్రపంచమునందలి సమశీతోష్ణమండలములందెల్ల ఇది బాగుగా ఎదుగును. హిందూదేశమున ఇది సమప్రదేశములనుండి సముద్రమట్టమునకు పదునాలుగువందలఅడుగుల ఎత్తునఉండు కొండప్రదేశములవరకును పండుచుండును. బార్లీవలె ఇన్ని వివిధ వాతావరణములందు పెరుగు ధాన్యపుజాతి మరియొకటి లేనికారణమున ప్రపంచమున వివిధప్రదేశములందు బార్లీపంట విస్తరించియున్నది.

### బార్లీ చరిత్ర

ప్రపంచమున వివిధప్రదేశములందు విస్తరించియుండుటయే కాను బార్లీ ప్రపంచమున వ్యవసాయమునకు లోబడిన మొక్కలలో అతిప్రాచీనమైనవానిలో నొకటి. క్రీ. పూ. 2700 సంవత్సరప్రాంతమున చీనాదేశమును పాలించిన చక్రవర్తి షేన్‌నంగ్ స్వయముగ చల్లి పండించిన ఐదురకముల ధాన్యములలో బార్లీయొకటి. బైబిలునందు బార్లీ తఱుచు ప్రస్తావింపబడియున్నది. క్రీ. పూ. 1015 సంవత్సరప్రాంతమున జీవించియుండిన సోలమన్ చక్రవర్తికాలమున ప్రధానమైన ఆహారపదార్థములలో బార్లీ యొకటి. అతిప్రాచీనమైన ఈజిప్టుదేశపుభూగర్భమందిరములందు యవలు దొరికినవి. అత్యంతప్రాచీనకాలమునుండియు ఉత్తరహిందూదేశమున యవలు పండింపబడుచున్నవనుటకు నిదర్శనములు గలవు. మన మతకర్మలలో పెక్కింటియందు యవలు విరివిగా ఉపయోగింపబడుచున్నవి. వేదములందు గొప్పదైవముగా వర్ణింపబడిన ఇంద్రుడు 'యవలను ఫలింపజేయువాడు' అను పర్యాయనామముతో తఱుచు పేర్కొనబడినాడు. పిల్లలు పుట్టినపుడు చేయు ఉత్సవములందు, వివాహమహోత్సవములందు, మరణానంతరకర్మలయందు, తదితరములగు మత

కర్మలయందు బార్లీ ధాన్యము ఉపయోగింపబడుచున్నవి. మరియు 'యవ' అనుధాన్యనామము సంస్కృతసారస్వతమున అత్యంతప్రాచీనకాలమునుండియు ఉండియున్నది. ఆదికాలమున యవలు ధాన్యసామాన్యనామమై యుండియుండును. అనంతరకాలమున అప్పటి ధాన్యములలో ప్రధానమైన బార్లీ ధాన్యమునకది రూఢమై యుండవచ్చును.

వ్యవసాయవిధానము

హిందూదేశమున బెనారస్, అలహాబాద్, ఆగ్రా మండలములందు బార్లీ పంట విస్తారము. మన మదరాసురాజధానియందు ఈ పంట మిక్కిలి తక్కువ. నీలగిరి, పళనికొండల దిగుప్రదేశములందుమాత్రము ఈపంట కొలదిగ గలదు. మొత్తముమీద మదరాసురాజధాని శీతోష్ణస్థితి బార్లీపంటకు అనువుకానిది. బార్లీవిత్తులను అక్టోబరు నెలలో కాని నవంబరు నెలలో కాని చల్లుదురు. మార్చి నెలలో కాని, ఏప్రియల్ నెలలో కాని పంట సిద్ధమగును. బొంబాయిరాజధానియందు సామాన్యముగా ఇది మరియేయితరగింజలతో కలుపబడకయే చల్లబడును. కాని అపుడపుడు ఆవాలతో కలిపి చల్లబడుట కలదు. పెక్కుప్రదేశములందు ఈ బార్లీగింజలతో గోధుమలు గాని, ఉలవలు గాని, బటానీలు గాని కలిపి చల్లుట ఆచారము. బార్లీపొలముల గట్టులయందు ఆవాలు కాని, ఎల్లగిసెవిత్తులు కాని చల్లుట కొన్నిప్రదేశములందలి పద్ధతి. ఇసుకతో గూడిన తేలికనేలలందు బార్లీ బాగుగా ఎదుగును. నేలకు విశేషమగు సత్తువ చేయనక్కరలేదు. విత్తులు చల్లుటకు పూర్వము సాధారణముగ సగటున నాలుగు సారులు నేలను బాగుగ దున్నుదురు. యకరమునకు సాధారణముగ ఎనుబది మొదలు నూటఇరువది పౌనులవఱకు విత్తులు కావలయును. నాగేటిచాలులందు విత్తులను చల్లి పిమ్మట నేలను చదును చేయుదురు. అటు తరువాత నీటిపారుదలకు చిన్నచిన్నబోదెలు తయారుచేయుదురు. ఒక్కొక్కప్పుడు ఈపంటకు నీరు పెట్టవలసిన అవసరమే యుండదు. ఎడపదడప వర్షములు కురియుచుండుతావులయందు నీరుపెట్టవలసిన అవసరమే యుండదు. విస్తారము కలుపుతీత కూడ అవసరము లేదు. పంట సిద్ధమగు మార్చి, ఏప్రియలు నెలలవఱకును దీనికి చేయదగు ఇతరపనులేమియు నుండవు. గోధుమవలెనే పంట సిద్ధము చేయబడును. కోసి, కట్టలుగా కట్టి కళ్ళములందు ఎండింతురు. పిమ్మట గోధుమలవలెనే నూర్చి బార్లీగింజలను మార్కెట్టుకు సిద్ధము చేయుదురు. బార్లీని ఇతరదినుసులతో అనగా గోధుమ, ఉలవలతో కలిపి చల్లినపుడు వానిని కలిపియే నూర్చి నిలవచేసి ఆహారమునకు ఉపయోగింతురు.

ఆహారమునకు తయారుచేయు పద్ధతి

బార్లీధాన్యమును ఆహారమునకు ఉపయోగార్హముగ చేయుటకు సాధారణముగ కఱ్ఱరోళ్ళలో పోసి దంచి చెరుగుదురు. ఒక్కొక్కప్పుడు కఱ్ఱపలకపై రాచి బాగుచేయుటయు గలదు. ఇట్లు బాగుచేయబడిన గింజలను ముతకపిండిగా విసురుదురు. ఈపిండితో విడిగా గాని లేక గోధుమపిండితోనైనను ఉలవపిండితోనైనను కలిపి గాని చపాటీలు (రొట్టెలు) చేయుదురు. లేదా బార్లీపిండితో అంబలికాచి గాని, ముద్దగా చేసి గాని దానిలో ఉప్పువేసి దానిని వెల్లుల్లి, నీరుల్లి, పచ్చిమిర్చి మున్నగువానితో చేర్చి భుజింతురు. ఈ చపాటీలును, జావయు పేదవారి ప్రధానమైన ఆహారపదార్థము. ఐరోపాఖండమునుండి దిగు

మతికాబడు బార్లీ ఆహారమునకంటె ఈవిధ
ముగా కంగామంగా దంచి తయారుచేసిన
ఆహారమున 'ఆల్బిమినాయిడ్సు' మిక్కిలి
హెచ్చుగనుండును. కాని జీర్ణమగుట కొంచె
మంత కష్టము. అగుటనే ఇది ఆరోగ్యవంతు
లే కాని అజీర్ణరోగులు, ఇతరరోగులు ఉప
యోగింపరానిది.

### ఔషధోపయోగము

బార్లీగింజల ఓషధీగుణమునుగూర్చి 'ధ
న్వంతరినిఘంటువు'లో ఇట్లు చెప్పబడినది :
'యవలు వగరుగ మధురముగ శీతలముగ
నుండును. పిత్తము, కఫము, రక్తదోషము
వీటిని హరించును. వ్రణములయందు నువ్వుల
వలెనే పథ్యకారి. రూక్షుజేయును- బుద్ధి,
అగ్నిదీపనము వీటిని వృద్ధిజేయును- లేఖన
కారి- మలమును బంధించును- స్వరమునకు
హితకారి- మేహము, దప్పి వీటిని పోకడ
చును- వాతము, మలవృద్ధి, స్థయిర్యము, దే
హావర్ణము వీటిని గలుగంజేయును. జిగటగ
నుండును.' బార్లీ తేలికగ జీర్ణమగును. అగు
టనే దీనిని రోగుల ఆహారమునందు వైద్యు
లు విరివిగా వాడుచున్నారు. బార్లీగింజలతో
చేయబడిన సత్తువు శూలతోగూడిన అజీర్ణ
రోగములందు ఆయుర్వేద వైద్యులు వాడు
దురు. బార్లీనీరు అనగా బార్లీగింజల కషా
యమును ఐరోపియన్ వైద్యులు రోగులకు
మాత్రమును జారీచేయుటకై వాడుదురు.
బార్లీనీరు మేహరోగులకు గుణకారియైనది.
పాట్నాప్రాంతములందు దేశీయవైద్యులు చ
లువ చేయుటకైన పర్వతులందు బార్లీ ఆకు
లను కాల్చి పొడిచేసి ఉపయోగింతురని డా
క్టర్ ఇర్విన్ చెప్పుచున్నాడు. పంజాబురాష్ట్ర
మునందలి సమప్రదేశములందు బార్లీదంటు
కాడలను కాల్చి మసిచేసిన భస్మమును అజీర్ణ
నివారణమునకు వాడుదురని డాక్టర్ స్టూ
వార్టు వ్రాయుచున్నాడు. మామూలుగ
తయారుచేయబడు బార్లీ ఆహారముకంటె
బార్లీబియ్యమును నానపోసి తయారుచేసిన ఆ
హారము తేలికగ జీర్ణమగునదిగను, ఎక్కువ
పుష్టిని కల్గించునదిగను నుండుట ఇటీవల
వైద్యులు తెలిసికొని అట్టి ఆహారమును
ఇపుడు విరివిగా ఉపయోగమునకు తెచ్చుచు
న్నారు. బార్లీగింజలను నానబోసి అవి మొ
క్కలు మొలుచు స్థితిలో తీసి ఎండబోసి
పిమ్మట ఉడికించి తయారుచేయు ఆహారము
రోగులకు అతిప్రశస్తముగా, శాంతికరము
గా నుండును. దీర్ఘరోగానంతరము ఈ ఆ
హారసేవనము గొప్పరసాయనమువలె పని
చేయును. నోటికి అరుచిగానుండుటచే సేవిం
చుటకు కష్టముగనుండు ఔషధములు సేవ
నార్హములగుటకు అవి ఇపుడు ఇట్టి బార్లీ
ఆహారముతో కలిపి ఈయబడుచున్నవి.

### గృహోపయోగము

బార్లీ గడ్డి గుఱ్ఱములకు, ఆవు మొదలగు
ఇతర పశువులకు ఉపయోగించును. మన
ప్రాంతములందు వరియాకుకోసి పశువులను
మేపునట్లే బార్లీపండు ప్రదేశములందు పం
టకు పూర్వము బార్లీఆకును ఒకటిరెండు సా
రులు కోసి గొడ్లకు వేయుదురు. మన ప్రాం
తములందు వరియాకు కోయుటచే వరిపంటకు
ఎట్టి నష్టముకాని ఎట్లు ఉండదో అట్లే అచట
బార్లీ ఆకును కోయుటచే బార్లీపంటకు ఎట్టి
నష్టముగాని యుండదు. నూర్చినపిమ్మట అగు
గడ్డికూడ పశువులకు ఉపయోగింపబడును.
కాని ఇది గోధుమగడ్డియంత ప్రశస్తమైనది
కాదు. బార్లీగింజలు ఉలవలతో కలిపిగాని
విడిగాగాని గుగ్గిళ్ళువైచి గుఱ్ఱములకు, ఇతర
పశువులకు పెట్టుదురు. ఈగుగ్గిళ్ళు వానికి

మంచి బలము చేయును.

### పరిశ్రామికోపయోగము

ఒకవిధమైన బీరు సారాయి తయారు చేయుటకుగాను బార్లీగింజలను హిందూదేశమున కొన్ని ప్రాంతములందు ఉపయోగింతురు. బార్లీగింజలనుండి సారాయిచేయు విధానము హిందూదేశీయులకు చిరకాలముగ తెలిసియున్నదే. ఇట్టిదానికి సంస్కృతమున 'యవసుర' అని పేరు. ఇది మైకముకల్గించు పానీయము. అల్లము, ఏలకులు, లవంగములు మొదలగు ద్రవ్యములు చేర్చి బార్లీతో ఒకవిధమైన ఆసవము తయారుచేయబడును. బార్లీతో బీర్ తయారుచేయుట ఐరోపాఖండమునకూడ విశేషప్రచారమున నున్నది. ఒక్కబీరు తయారుచేయుటకేగాక బార్లీవలన ఇతర పరిశ్రామికోపయోగములు కూడ గలవు. పంజాబు దేశమునందలి కొండ ప్రదేశములందు బార్లీగడ్డితో ఒకవిధమైన చెప్పులు—మన ఆకుచెప్పులవంటివి—తయారు చేయబడును.

### మతకర్మలయందుపయోగము

హిందువుల మతకర్మలలో పెక్కింటియందు యవధాన్యముయొక్క అవశ్యకతగలదు. సంపన్నతకు యవ లోకగురుతు. జ్యోతిష శాస్త్రవేత్తలు దీనిని శనిగ్రహసంబంధమగు దొడ్డ మొలకగా పేర్కొందురు. హిందూదేశపు వేదవాఙ్మయమున ఇది ఇంద్రదైవముతో విశేష సంబంధముకలదిగా వర్ణింపబడినది. పిల్లలు పుట్టినపుడు చేయబడు ఉత్సవములందు, పరిణయమహోత్సవములందు, ఉత్తరక్రియల సందర్భములందు, యజ్ఞయాగాదులందు ఇవి విధ్యుక్తముగా ఉపయోగింపబడును. వైశాఖమాసమున శుక్ల చతుర్థిని ఉత్తరహిందూదేశీయులు 'యవచతుర్థి'గా పేర్కొనుచు పండుగు చేసికొందురు. ఆనాడు వారు ఒకవిధమైన క్రీడయందు వినోదింతురు. ఆక్రీడను పురస్కరించుకొని వారు యవలపిండితో చేయబడిన ముద్దలతో ఒండొరులను విలాసముగా కొట్టుకొందురు.

హిందూదేశమునందలి పలు భాషలలో యవలు నేడు—జవ్, జా, ఇంద్రజవ్, జవ—మున్నగు నామములతో వ్యవహరింపబడుచున్నవి. యవలకు సంస్కృతమునగల పర్యాయనామములలో 'మునిభక్ష' యొకటి. ఈ నామముచేతనే ఇవి సాత్వికాహారమగుట తెలిసికొనవచ్చును.



# తూములూరి శివకామయ్య — 'ఖిజీర్'

రచయిత :

ఏ. వి. సీతారామయ్య, ఎం. ఏ.

['ఖిల్జీరాజ్యపతనము' ఒక తెలుగు చారిత్రాత్మక నాటకము. దానిలోని కథానాయకుడు ఖిజీర్ సుల్తాను కుమారుడు. సుగుణఖని. ఈపాత్రను అత్యద్భుతముగా నటించినాడు నెల్లూరి మిత్రమండలి సభ్యుడు శివకామయ్య. ఆసభవారీనాటకమును గతపరిషత్ప్రదర్శనములయందిమిడ్చినపుడు, ఆంధ్రనాట్యరంగము తారుమారుగానున్న ఈసమయమందు క్రమశిక్షణాఫలితమైన వారి 'ఖిల్జీరాజ్యపతన' ప్రదర్శనమును, తద్వారా బళ్లారి రాఘవాచార్యులుగారికి సముడైన నటుని, యిచ్చినందుకు నెల్లూరి మిత్రమండలి వారికి ఆంధ్రనాట్యకళాభిలాషులు కృతజ్ఞులు.]

ఆంధ్రనాట్యరంగమున కంట్రాక్టు నాటకములు తలయెత్తిన తరువాత నటులలో క్రమశిక్షణ అంటే అపురూపమైపోయింది. సరిగా నాటకసమయానికి నలుగురు పెద్దలూ తమ బొక్కసాలతో హాజరై అప్పటి కప్పుడు వేయమని కోరబడిన వేషాలువేసి తమపేర్ల మీద ఆకర్షింపబడిన పామరప్రేక్షకులనైనా రంజింపజేయలేక అభాసుపాలవుతున్నారు. ఈ దుర్గతి తుదకు ఆంధ్రనాటక కళాపరిషత్తువంటి మహాసంస్థకు గూడ తప్పటలేదు. క్రమశిక్షణగల నాటకసమాజములు లేకపోవడంచేత మంచినటులు బయల్పడకుండా వున్నారు.

ఇటువంటి తారుమారు పరిస్థితులలో విశేషకాలము కష్టించి, క్రమశిక్షణపొంది, 'ఖిల్జీరాజ్యపతనము'ను, ప్రతిభాశాలియైన శివకామయ్యయను నటశ్రేష్ఠుని ఆంధ్రదేశానికి సమర్పించారు నెల్లూరి మిత్రమండలివారు. వారి నాటకప్రదర్శనము ఆదర్శవంతముగనుండి, గత పదిసంవత్సరములలో ఇటువంటి కట్టుబాటుగా ప్రదర్శింపబడిన నాటకము చూడలేదనిపించి, అసంఖ్యాకములైన మన నామరూప నాటకసమాజములకు మార్గదర్శిగా చూపట్టింది.

ఆనాటకప్రదర్శనానికి జీవము శివకామయ్య 'ఖిజీర్' పాత్రాభినయము. కథానాయకుడగు ఖిజీర్ అల్లావుద్దీన్ చక్రవర్తియొక్క ఏకైకపుత్రుడు; సుల్తాను వంశములలో సర్వసామాన్యమైన మదిరాసక్తుడైనను కార్యదీక్ష, పౌరుషము, ధర్మబుద్ధిగల యోధుడు. స్త్రీలోలుడైనను నిష్కల్మషప్రేమైకజీవి. ఎట్టి విరోధినైనను ధర్మయుద్ధమునగాని జయింపనొల్లని శౌర్యధనుడు. యోధుడైనను మృదులమనస్కుడు.

యువరాజు ఖిజీర్ మదిరను గ్రోలుతూ కనపడతాడు, రోషనార నాటకములోని మోఅజీమువలె. కాని త్రాగునది మద్యమైనను, మానవుడు తన సాంఘికస్థానమును బట్టి ప్రవర్తించునను సూక్ష్మసిద్ధాంతమును గూడ గ్రహింపలేని మన నటశిఖామణులవలె గాక, శివకామయ్య మద్యమును గ్రోలుచు యువరాజునకు తగిన విధమున నటించుట చూచి అబ్బురపడితిని. పిచ్చికేకలు లేవు- కోతిగంతులులేవు- హంగామా లేదు- మైకము కల్గి

నది- కాని రాజఠీవి వీడలేదు- గాంభీర్యము ప్రశాంతముగానున్న మైకము- మదిరాపాన ముచేసిన యువరాజుప్రవర్తనమేగాని తప్ప త్రాగిన సాహెబు చేష్టలు కనపడలే దాతని యభినయమున.

మత్తుగానున్నను కమలాబేగం ప్రశ్నలకు జవాబులిచ్చునపుడు ఆతని స్థిరత్వము, చూపులలోని నిశ్చలత అనుపమానములు. దర్పము గల ఆంగికచలనము- అదియైనను మాతృ సమానురాలి యెదుట వినయమున అణగియున్నది- 'దేవల'ను 'గఫూర్' తన భటులతోగూడ నిర్బంధించబోవు సమయమున హఠాత్తుగావచ్చి ఆమెను రక్షించు సందర్భమునను, ఒక బాలికకొరకు ఇరువది వేల సైన్యము రావలసివచ్చినందుకు గఫూర్‌ను నిందించుచు తాను సిగ్గుచెందునపుడును; 'దేవలను' ఒకప్పుడు దేవలపాణికి నిరాకరింపబడి వెనుకజెందియున్న ఒక హిందూరాజునొద్దకు తోడ్కొనిపోవు సమయముననను; ఆరాజు వెనుకటి అవమానమును దలచుకొని ఆమెకు శరణివ్వ నిరాకరింప వీరపురుషోచితముగా నాతని మందలించునపుడును; రాజమాతయొక్క ఔదార్యమున కామెను అభినందించునపుడును; రాజు తనను నిర్బంధించదలప నవ్వి, తాను ధర్మయుద్ధముదప్ప అన్యము నొల్లనని ముందు తన కోటను బాగుచేసుకొనమని రాజుకు సలహానొసంగుపట్లను; శివకామయ్య మాటల ఉచ్చారణ, చూపులు, ఆంగికచలనము గంభీరముగా నుండి ఆతనికిగల గొప్ప భవిష్యత్తును చూపించుచున్నవి.

తన అంగరక్షకుడుగా నటించుచూ ప్రాణదానము చేసినది 'మోతీ' యేయని తెలుసుకొనినపు డాతని ఆవేదన అద్భుతము- పుత్రప్రేమ, ఖురాన్‌ల మధ్య నలిగిపోతున్న తండ్రికి ప్రతిజ్ఞాపాలనమే వీరపురుషలక్షణమని కర్తవ్యము నెరిగించునపు డాతని ప్రవర్తన ప్రశాంతము- కరుణభూయిష్ఠము-

ఆంధ్రరంగస్థలమందలి నటులలో స్థానం నరసింహారావు ఉత్తమోత్తముడు- ఆతని ఛాయలు కొంతవరకు గలిగి రాఘవాచార్యునితో సమమైన శిక్షణాఫలితమును ప్రదర్శించుచున్న నటుడు శివకామయ్య, చూపుచేతనే కనులవెంట నీరు తెప్పించగలవాడు- చూపుచేతనే ఎదుటివారిని వీక్షింపచగలవాడు. ఇపుడు ఆవేదనాపూరితమైన ఆర్తనాదము- మరియొకపుడు ఆజ్ఞాసహితమైన మేఘగర్జన. ఎటువంటి రౌద్రరసప్రదర్శనముననైన గాంభీర్యము, దర్పము విడనాడని ప్రవర్తన. కథానాయకపాత్రధారులకు అందున రాజవేషధారులకు శివకామయ్యపాత్రపోషణ అనుకరణీయము-

అటువంటి ప్రసిద్ధనటుని గురించి వ్రాయబూనడంకంటె నాట్యకళాభిలాషులు వారి ప్రదర్శనాన్ని చూడమని కోరుతున్నా నేను- ఒకప్పుడు ఆంధ్రనాటకకళాపరిషదధ్యక్షులు, విద్యాధికులైన నటులు అగు గోవిందరాజుల సుబ్బారావుగారి మాటలు ఈ నటుని కళాభిజ్ఞతను వెల్లడిచేయగలవని నా నమ్మకము:

'ఈనాటకంలో ఖిజీర్ పాత్ర ధరించిన తూములూరి శివకామయ్య రెండవ రాఘవాచారి అనడానికి సందేహంలేదు- నెల్లూరిలో మరియొక రాఘవాచారి అభివృద్ధిగాంచుతున్నాడని తెలుసుకోడానికి నాకు ఆనందం కలుగుతూంది- ఈనటుడు సంగీతం, పద్యాల జోలికి పోకుండా, ఇటువంటి ఉత్తమతరగతి నాటకాలు ప్రదర్శిస్తూంటే బాగుంటుంది- భారతదేశంలోని సుప్రసిద్ధనటులలో శివకామయ్య యొకడు-'

# ఇది యుగాది

రచయిత:

ఓలేటి సీతారామమూర్తి, బి. ఏ.

౧

ఇది యుగాది- చిగిర్చిన ఇగురుమోవి
తళుకుఁగెంపుల సూనస్మితములఁ దరులు
ప్రకృతివదనమ్ములోని శోభల ఘటించు
స్నిగ్ధమోదమ్ము మానవచేతములకు.

౨

మానితవిభాతదివ్యధామమ్మునందు
అవతరించె నేఁడిదె వసంతార్భకుండు!
విశ్వమంగళగీతము పికము పాడ
జగము పులకించె నవవికాసమ్ముతోడ.

౩

ప్రాచి విరఁజిమ్మ నరుణగభస్తియందు
సందడించిన నూతనోత్సాహశక్తి
అణువుమొదలుగ బ్రహ్మాండమందు నిండి
చాటె నవ్యవసంతనిస్తంద్రభూతి.

౪

పుష్పవతియా లతాశ్యామమోమునందు
తేకులెత్తిన నవమోహలీల లరసి
పవనపల్లవుఁ డానందభరితమైన
వలపుగుసగుసల్ నించు ప్రభాతవేళ.

౫

జీవితప్రసవమున విచ్చినది నేఁడు
పరువము వెలార్చు నొకక్రొత్తవలపురేకు;
నాయెడందయే చవువుకొన్నది తనంత
భావిభాగ్యోదయాంకురపంక్తు లందు.

౬

కసరు మావిపిందెల చవుల్గవిసికొన్న
వేపక్రొంబువ్వుపచ్చడి ప్లేటు తెచ్చి
అందియిచ్చు నాయర్ధాంగి ఆననమున
క్రొత్తనవ్వుమవ్వమ్ములే గుస్తరించె.

౭

ఈ యుగాది నూత్నానిల మొసక మెసఁగ
పీల్చికొని పువుపడంతులు వివశలైరి,
నాదు హృదయమ్ము ప్రకృతితో నాట్యమాడె;
ప్రకృతి నాయెద భావపుష్పములు జల్లె!

౮

పచ్చిమధువు పాటలఁ గార్చె పరభృతమ్ము;
కమ్మరచన చక్కెరలొల్కె కవికలమ్ము;
ప్రకృతికెల్లను నూత్నజీవన మొసంగ—
ఇంత మహితశక్తిని గల్గు నిది ఉగాది!

* * *

౯

భావమధురిమ లామోదజీవకళలు
ప్రస్ఫుటముగ నిత్యము జీరువాఱుకతన
మా తెనుఁగుసీమ పండుగల్ మానితములు,
అభినవప్రభార్చికలు కళార్చకులకు!

# బిడ్డల విద్యాభ్యాసము

[టాల్ స్టాయి]

అనువాదకర్త:

వల్లాప్రగడ ప్రకాశరాయుడు, ఎం. ఏ.

బిడ్డలకు సాధ్యమైనంత తక్కువవిద్య నేర్పవలెను- తమబిడ్డలు నేర్చుకొనవలసిన విషయములతో తమకేమాత్రమును పరిచయము లేని తల్లులు బిడ్డల శిక్షణకు పూనుకొన్నచో, బిడ్డలకు చదువెక్కువై విద్యాసంబంధమగు- అజీర్ణరోగము పట్టుకొనును- తల్లుల మూర్ఖతకు ఫలితముగ బిడ్డలకు చదువుమీద అసహ్యత పుట్టును- అయినది, కానిది బలవంతముగ బిడ్డల మనస్సుల కెక్కించి, చదువనగనే వారికి భయముపుట్టించుట చాల అనర్థము- కొన్ని కొన్ని విషయములను గూర్చి అసలే పరిచయములేకుండ బిడ్డలు పెరిగి పెద్దవారైనను అంతగ నష్టములేదు- బిడ్డగాని, లేక వయసువచ్చిన వ్యక్తిగాని తాను నేర్చెడు విషయమునుగూర్చి తన కభిరుచిలేనిదే, దాని నతడు బాగుగ గ్రహింపగలుగుటయే అసంభవము- నిజమగు తృష్ణతో గూడుకొనని విద్యాభ్యాస మెప్పుడును చెడుగునకే దారితీయును- మానసికముగ మనుష్యుని నొక్కి- సంకుచితపరచి, వికలాంగునిగ మార్చివేయు భయంకరావస్థయే తుదిఫలము-

సామాన్యముగ పలువు రిట్లనుచుందురు : 'బిడ్డలకు కట్టుదిట్టమైన విద్యాభ్యాసమును, క్రమశిక్షణయు లేనిచో వారిక చేయవలసినపాటు యేముండును ? ఊరిబాలురతో కలిసి కొట్లాడుకొనుచు, దురభ్యాసములలో జిక్కి- పలుగాకులై పోవలసిన దేనా?' ఇట్టి భయమునకు కారణము లేకపోలేదు- ఇప్పటి మన సంఘస్థితినిబట్టి. సంఘమున పెరిగిపోయిన భోగలాలసతనుబట్టి. బిడ్డలనుకూడ అట్టి నిరర్థకజీవితమునకే తయారుచేయుచున్నాము- భోగేచ్ఛతోనిండిన జీవితమునకు బిడ్డలను తయారుచేయుట నిజముగ ఆవశ్యకమా? దినదినమును తమకుపయోగపడుచుండు వస్తువులన్నియు, తామేమాత్రమును శ్రమపడనక్కరలేకయే, వాటియంతట అవే, యెప్పటి కప్పుడు తమకు లభించుచున్నవనియే తప్ప, అంతకుమించి బిడ్డకేమియు తెలియుటలేదు. హానికరమగు నిట్టి యజ్ఞానమునందు బిడ్డల నుంచవలసిన దేనా యని నేనడుగుదును. తనకు కావలసిన ప్రతివస్తువును, కోరుకొనగానే ఆకాశమునుండి యూడిపడుచుండుట లేదనియు, యితరు లెందరో కష్టపడి, చెమటూడ్చి తయారుచేయుటచేతనే తన యవసరములన్నియు సునాయాసముగ గడచిపోవుచున్నవనియు, ప్రతిబిడ్డకును స్పష్టముగ తెలియజేయవలెను. ఈవిషయము బిడ్డ లెరిగియుండుటత్యావశ్యకము. విద్యావిధానమునందు జాగ్రత

పడవలసిన ప్రప్రథమవిషయ మిదియే. తానుపయోగించు అన్ని వస్తువులును యితరులనేకుల కాయకష్టమునుండియే తయారగుచున్నవనియు, ఆవస్తువులను తయారుచేయు పనివాండ్రకు తాను కాణాచిబిడ్డ కాడనియు, వారు తన్నేమాత్రమును ఎరిగియుండరనియు బిడ్డ చిన్నతనమునందే అర్థము చేసికొనగలుగుట కష్టమందురేమో! కొంత కష్టమే కావచ్చును. పెద్దవాడైనకొలదిని అన్ని విషయములవలెనే దీనినిగూడ తెలిసికొనగలడుకదా! తా నన్నము దిను పళ్ళెమును, నీరు త్రాగు పాత్రయు ప్రతిదినము తోమి శుభ్రపరచునదెవరో తాను చూచుచునే యుండును. ఆ చాకిరియంతయు, తనయం దేమాత్రపు ప్రేమయులేకియే, పనియం దుత్సాహమును ఆనందమును లేకయే, యింటిదాసి విసుగుకొనుచు చేయుచున్నదని తెలిసికొనగలడుకదా! దినదినమును తాను విడిచిన దుస్తులు, పాదరక్షలు నౌకర్లచేతనే శుభ్రపరుపబడుచున్నవనియు, ఈ సేవయంతయు తనయెడల వారి కుండు ప్రేమచేత జరుగుట లేదనియు, దానికి తనకు తెలియని మరియొక కారణమున్నదనియు, తెలిసికొని లజ్జచెందవలసిన అవసరమెంతైనకలదు. తా నట్లు యేమాత్రమును సిగ్గుచెందక, దానినిగూర్చి యించుకేని తలపునకు రానీయక, వారిసేవను పొందుచు సుఖమనుభవించుటయే అభ్యాసముచేసికొన్నయెడల, అంతకంటె నీచమగు విద్యాప్రారంభము మరియొక టుండబోదు. అట్టి యవిద్య బిడ్డయొక్క భావిజీవితమున కంతకును తీరని కళంకమై నిలిచిపోవును. ఈ యపాయకరస్థితినుండి బిడ్డలను తప్పించుట అత్యావశ్యకము. అది అతిసులభమైన పనిగూడ. బిడ్డలు యేయేపనులను తమంతట తాము చేసికొనగలుగుదురో ఆయాపను లెల్ల విధిగ వారిచేతనే చేయించుచుండవలెను. తమగిన్నెలును, చెంబులును తామే కడిగి శుభ్రపరచుకొనవలె; తమగదులు తామే తుడిచి శుభ్రపరచుకొని, వస్తువు లెక్కడివక్కడ జాగ్రతగా నుంచుకొనవలె; బట్టలు, పాదరక్షలు స్వయముగ బాగుచేసికొనవలె; తమ భోజనపుగిన్నెలు, పళ్ళెములు తామే తెచ్చి పెట్టుకొనవలె. పైవిషయము లెంత అల్పములుగ పైకగపడుచున్నను, బిడ్డయొక్క నిజమైన క్షేమమునకు, సుఖమునకు – ఫ్రెన్చి, జర్మను, యింగ్లీషుభాషలు నేర్చుకొనుటకంటె, ఆ మూలాగ్రముగ దేశదేశముల చరిత్ర గ్రంథముల పఠించుటకంటె, ఈ విషయములను గూర్చిన యథార్థజ్ఞానమును, ఆచరణయు నెక్కువ ఆవశ్యకమని గుర్తింపుము. అయితే యిందొక యిబ్బంది యొకటగపడుచున్నది. తల్లిదండ్రు లేయేపనులు చేయుచుందురో వానినే పిల్లలుగూడ అత్యుత్సాహముతో చేయుచుండుట సహజము. కనుక తమబిడ్డల కెటువంటి పనులు నేర్పవలెననుకొందురో, ముందా పనులు తల్లిదండ్రులే చేయుచుండుటకు నిశ్చయించుకొనవలె. ఈ యాచరణము రెండు విధముల మహోపకారియగుచున్నది. స్వాభావికములును నిజముగ ప్రయోజనకరములును నగు పనులయందు కాలము బుచ్చుటవలన కేవలము పాఠముల రూపమున నేర్చుకొను పుస్తకపు చదువు తక్కువగుట యొకటి–తద్వారా బిడ్డలను నిరాడంబరజీవితమునకును, దేహపరిశ్రమకును, స్వయంసహాయమునకును తయారుచేయుట రెండవది జాగరూకతతో నీపని యొక్కటి మాత్రము తప్పక నెరవేర్చుడు. మీ రిట్టి కార్యమునకు పూనుకొనిన మొదటిమాసములోపలనే మీ

కమితమగు మనస్సంతృప్తి కలుగగలదు. బిడ్డలంతకంటెను అధికమగుతృప్తిని, ఆనందమును వెలిబుచ్చుదురు. దీనికితోడు కొంత పొలముపని కూడ (కూరగాయలతోటయుండైనను సరే) బిడ్డలకు కల్పింపగలిగితిరా యింకను మేలు. తోటపని సామాన్యముగ బిడ్డలకు ఆటవలెనే వేడుకను కలిగించును. ఎవరిపని వారు శాశ్వత పూని చేసుకొనువిధానము ఉత్తమమైనదని యెంచబడి మంచి విద్యాలయములన్నిటియందును అవలంబింపబడుచున్నది. ఈవిషయము ముఖ్యముగ గుర్తింపబడనిచో నీతివిద్యయను నదే యసంభవమని- మానవులందరు సరిసమానులును, సోదరులు నను భావమునకు తరువాత అవకాశమే లేకుండ బోవునని నమ్ముడు.

మానవజాతియంతయు ప్రభువులు, బానిసలు అను రెండు తెగలుగ జీలియున్నదని బిడ్డకు తెలియజెప్పవలెను. మానవసమత్వమును గూర్చియు సౌభ్రాత్రమును గూర్చియు వట్టి నోటిమాటలతో బిడ్డకు మీరెంతసేపు నూరిపోసినను లాభములేదు. బిడ్డలు నిద్రలేచినది మొదలు పరుండునరకును తమచుట్టును జరుగుచుండు సమస్తకార్యములును పైసూత్రమునకు వ్యతిరేకముగనే జరుగుచున్నవని స్వయముగ, స్పష్టముగ చూచుచునే యుందురు. అట్టి స్థితిలో తమ తల్లిదండ్రులుగాని తదితర పెద్దమనుష్యులుగాని నీతిధర్మమును గూర్చి ఎంతనోరుచేసికొని బోధించినను అట్టి బోధయందు వారికేమాత్రమును విశ్వాసముండదు. మీబోధలన్నియు వట్టి బూటకములని బిడ్డకు తెలిసిపోవును. తల్లిదండ్రులయందును, ఉపాధ్యాయులయందును గూడ పూర్తిగ నమ్మకము చెడుటయేగాక, జీవితమునకు సత్యముతోగాని ధర్మముతోగాని పనియే లేదని వాదించు స్థితికి వచ్చును.

మరొక్కమాట. పైన చెప్పినదంతయు ఒక్కసారిగ బిడ్డల కలవరచుట దుస్సాధ్యమని మీరనుకొనినచో, నీయొక్కపనినైన చేయవచ్చును. ఏపని బిడ్డ స్వయముగ జేసికొనకపోవుటచేత అప్పటికప్పుడే ప్రత్యక్షమగు నిబ్బంది యేర్పడునో, - ఆపనినైనను తాను చేసికొనుట తప్పని సరియగునట్లు చేయవలెను. ఎట్లనగా, బయటకు పోవునప్పుడు ధరించు వస్తులు, పాదరక్షలు మొదలైనవి శుభ్రపరచుకొననియెడల, విహారమునకు బయలుదేరుటయే అసంభవమగునట్లు చేయవలెను. నీరు తెచ్చి వంటపాత్రలు మొదలగునవి కడిగి శుభ్రపరుపనియెడల ఆపూట తినుటకేమియు లేక పస్తుపడియుండవలసినదేయని అనుభవసిద్ధముగ బిడ్డలకు తెలియుచుండవలెను. ఈపద్ధతి ననుసరించుటలో నితరులు చేయు పరిహాసమునకుగాని, నిందకుగాని భయపడనక్కరలేదు. ప్రపంచమున నేదేని దుష్కార్యమును, లేక కుతంత్రమును చాకచక్యముగ నెరవేర్పజాలనివాడు అశక్తుడని, చేతకానివాడని లోకులు గేలిచేయుచుందురు. ఈలోకమున జరుగుచున్న చెడుపనులన్నియు, పదింట తొమ్మిదిపాళ్ళు యిట్టిలోకనిందకు భయపడుటచేతనే చేయబడుచున్నవి.



# ది ఫాయిల్ బ్రదర్సు

[సెకండుహ్యాండుపుస్తకములలో వర్తకము చేయుకంపెనీ. ఆకంపెనీ ప్రధానకార్యస్థానమందిరము ముప్పదివేల చతురపుటడుగుల వైశాల్యముగలది. ఆఱు అంతస్థుల బ్రహ్మాండభవనము. రెండులక్షల గ్రంథ సంపుటము లొక్కసారిగ నిలువచేయుటకు ఆమందిరమున ఏర్పాటులుగలవు. సెకండుహ్యాండు పుస్తకము లను వీ.పీగా పంపుడని ఆర్డరు ఇచ్చు ఉత్తరములు ఆకంపెనీకి దినమునకు రెండువేలకు పయిబడి వచ్చు చుండును. అట్టి కంపెనీ చరిత్ర తెలిసికొనుటకు కుతూహల మున్నదా?]

ముప్పదియేండ్లకు పూర్వపు ముచ్చట. లండనులో ఫాయిల్‌వంశమున బుట్టిన సోదరు లిరువురు సివిల్‌సర్వీసులో జేరుటకై ప్రవేశ పరీక్షకు పోయిరి. కాని వారికి పరీక్షలో జయ ముకలుగలేదు. పరీక్షలో తప్పిపోవుటయే వారి కొక వరప్రసాదమైనది. ఆపరీక్షలో తప్పి పోవుటయే వారి అదృష్టమునకు అంకురార్పణ మైనట్లయినది.

కాని, పరీక్ష తప్పిపోయిన క్రొత్తలో వా రు చాల డీలుపడిపోయిరి. పరీక్ష పోయినది. ఇక నేమిచేయుట ? భావి అగమ్యగోచరముగ నుండినది. పెద్దవానినామము విలియమ్ ఎ ఫాయిల్; చిన్నవానినామము గిల్బర్టు యస్. ఫాయిల్. వారితండ్రి షోర్‌డిచ్‌సందు టోకు గా పలుసరుకు లమ్మువాడు.

అయిన ఆబాలురకు విశేషమగు ఆస్తి ఏమియు లేకుండెను. వారికడ ఉన్న సెకండు హ్యాండు పుస్తకములే చరరూపకమగు వారి ఆస్తిలో ప్రధానముగ పేర్కొనదగినవై యుండెను. ఆసోదరులలో నొకడు ఒకనాటి 'ఈపాత పుస్తకములను అమ్మవచ్చునుగదా?' అని అడిగెను.

ఎంతటి మంచి క్షణమున ఆబాలుని నోటి నుండి ఆవాక్యము ఉద్గారితమయ్యెనో ఎట్టి సంకోచమునులేక రెండవసోదరుడు ఆపుస్తక ములను అమ్ముటకు అంగీకరించెను. తోడనే వారు ఒకచిన్న ప్రకటనను వ్రాసిరి. దానిని విద్యావిషయకమగు నొకపత్రికయందు ప్రచు రించిరి. ఆనంతరకాలమున ఫాయిల్ బ్రదర్సు కంపెనీని సెకండుహ్యాండుపుస్తకముల వ్యాపా రసంస్థలలో అద్వితీయమైనదిగా చేయుటకు బోణీఅయిన ఆ తొలుతటి ప్రకటనను ప్రచు రించిన పత్రిక పవిత్రనామము ఇపుడు లబ్ధమ గుటలేదు. లబ్ధమే అయిఉన్నచో అది సహస్ర జిహ్వలతో శ్లాఘింపదగినది.

ఆపత్రిక యొక్కటియే శ్లాఘింపదగినది కాదు. అందలి ఫాయిల్ బ్రదర్సు ప్రకటనము లోని వాక్యములును విశేషశ్లాఘనీయ ములే. ఆప్రకటనపత్రిక బంగారు రేకులతో పొదుగబడి బంగారుచట్రముతో కట్టబడి నేటి ఫాయిల్‌బ్రదర్సు వారి సరి క్రొత్త మం దిరమున వ్రేలాడతీయదగినది.

ఆ ప్రకటనయే ఆఫాయిల్‌బ్రదర్సు కంపె నీకి ప్రారంభోత్సవము గావించినది; ఆఫా యిల్ సోదరుల జీవితమునకు శుభారంభము, స్థిరమైన నడవడి కల్గించినది; ప్రపంచమునం దలి సెకండుహ్యాండు గ్రంథముల వ్యాపార సంస్థలలో అద్వితీయమైన ఫాయిల్ బ్రదర్సు సంస్థకు మాతృస్థానమైనది. ఆప్రకటన ఎంత ప్రశస్తమైనది ! ఎంత పవిత్రమైనది !

ఆ ఒక్క ప్రకటనకే ఎన్నియో ఎంక్వయిరీలు వచ్చినవి. ఆబాలురదగ్గరఉన్న పుస్తకములకు మూడురెట్లు పుస్తకములు ఉన్నను ఆతరుణమున వారు అమ్మియుందురు.

తోడనే వారికి మారుబేరమునకు సెకండుహ్యాండు పుస్తకములు కొని ఏల తిరిగి అమ్మరాదు అని తోచెను. తోచినది తడువుగా వారట్టి వ్యాపారమునకు దొరకొనిరి. ప్రకటనమీద ప్రకటన. పెద్దమార్కట్టు ఏర్పడెను. అవకాశమునందుకొని శీఘ్రగతిని అభివృద్ధినందుటలో వారు అప్రమత్తులై మెలగుచువచ్చిరి.

వారి ప్రథమవ్యాపార కార్యస్థానమేది? వారి యిల్లే. వారుకొనిన సెకండుహ్యాండు పుస్తకములను వారు వారి వంటయింటియందే స్టాకుచేయువారు.

వారి వ్యాపారము రోగుకామవలె అతిశీఘ్రగతిని అభివృద్ధినందెను. కుటుంబమునకు, వ్యాపారమునకు ఆయిల్లు చాలినదికాదు. తమ వ్యాపారముతో ఆబాలురైనను; కుండమండతో ఆకుటుంబమువారైనను ఆయిల్లు వదిలి పోవలసివచ్చెను. దినదినాభివృద్ధిగాంచుచున్న వ్యాపారమునకు ఇంటిని కార్యస్థానముగా చేయుటకంటె ఇంటిని ఇల్లుగానే యుంచి తాము మరియొకతావునకు తరలిపోవుటకే ఆబాలురు కృతనిశ్చయులైరి.

పెక్‌హ్యామ్ అను పేటయందలి ఒక చిన్న దుకాణమును వారు అద్దెకు పుచ్చుకొనిరి. ఈ అద్దెకు పుచ్చుకొనుట వారు పోస్టుద్వారా ఏర్పఱచుకొనిరి. పోస్టుద్వారా ఏర్పఱచుకొనుటయే మేలైనది. ఏమన? ఆసోదరుల ఇరువురిలో ఒక్కడికికూడ అప్పటికి మైనారిటీ దాటలేదు. పెద్దవానికి అప్పుడే పదునెనిమిదవ సంవత్సరమువచ్చెను. మెజారిటి రాని కుఱ్ఱవాళ్ళతో ఇంటియజమాని అద్దెకంట్రాక్టు ఎట్లు గావించుకొనును? కావుననే అద్దెకంట్రాక్టు ఏర్పాటు పోస్టులో గావించుకొనుట మేలే యైనదనుట.

ఈకొట్టుకు ప్రక్కనే వేఱొకతావున వారొక చిన్నగదిని అద్దెకు పుచ్చుకొనిరి. ఆగదియందు ఆసోదరు లిరువురును తమ పడుకకు ఏర్పాట్లు చేసికొనిరి. జీవితమున చేయవలసిన ప్రధానమును నిజమును అగు పనికి వారు నిశ్చలారంభులైరి.

దుకాణమునకు వెనుకతట్టున వారు తమ ఆహారమును తామే వండుకొనువారు. పనికి వారికి పగలు రాత్రి యను వివక్షత లేకుండెను. ఆదివారపుపూటనైన శలవుగొనుట యెట్టిదో వారు ఎఱుగరు.

ఇట్లు వ్యాపారము ఒక్కసంవత్సరము సాగినది. అప్పుడు వారికి దానిని మిక్కిలి పెద్ద పెట్టున నడుపవలెనను కుతూహలము అగ్గలమయ్యెను. అగుటను వారు లండన్ మహానగరమునడుమ ఛారింగ్ క్రాస్ రోడ్ నకు చెంత ఒక పెద్దదుకాణమును బాడుగకు గైకొనిరి. ఏడాదికి ఆఱువదిపౌనుల బాడుగ. పైగా మునిసిపల్ పన్నులు మున్నగునవి వారే భరింపవలయును.

అప్పటి వారి తాహతుకు అది సాహసకార్యమే అనవలయును. ఏమన? వారికి ఆయదనున ఎన్నియో క్లిష్టసమస్యలు బృహద్రూపమున పొడసూపెను. తమ దుకాణపు మొదటి అసిస్టెంటు ఏడుపౌనులు కాటుకవేసి పారిపోయెను.

దుకాణమున మేరియొక అసిస్టెంటును నియమించిరి. ఈ రెండవఅసిస్టెంటు సమర్థుడును, సద్ధర్ముడును. నేటికికూడ ఆతడు ఫాయిల్ బ్రదర్సుతోబాటు కంపెనీ అభివృద్ధికి నిరంతరము పరిశ్రమించుచున్నాడు.

నేడు ఆఫాయిల్సు సోదరులకు ప్రపంచము నందలి అన్ని ప్రాంతములందును కస్టమర్సు గలరు. పుస్తకములకు ఆర్డర్లు ఇచ్చు ఉత్తరములు ఆకంపెనీవారికి దినమునకు రెండువేలకు పైబడియు ఐదువేలకు లోబడియు వచ్చుచుండును. దినమునకు వచ్చు కనీసపు ఆర్డర్లు కనీసము రెండువేలు! వంటయింటిలో ప్రారంభమైన ఆ చిన్నివ్యాపారమునకు ఇది ఎంతటి అభివృద్ధి!

విజ్ఞానసంపాదనకాంక్ష అగ్గలమై యుండియు క్రొత్త పుస్తకములను కొనుక్కొనలేని ఎందరికో ఫాయిల్ బ్రదర్సువారి సెకండు హేండు పుస్తకములు విజ్ఞానభిక్ష పెట్టినవి. పెట్టుచున్నవి. ఆకంపెనీ ఒకపెద్ద విశ్వవిద్యాలయమువలె విద్యావ్యాప్తి కెంతయో తోడుపడుచున్నది.

1929-వ సంవత్సరమున ఆకంపెనీవారు అద్దెఇండ్లను విడనాడి స్వగృహమును నిర్మించుకొని అందు ప్రవేశింపగల్గిరి. సెకండు హేండు పుస్తకములను కొని మారుబేరమునకు అమ్ము ఆ కంపెనీవారి స్వగృహము ఎట్టిదిగా నుండునో మీరు ఊహించగలరా? ఆ కంపెనీవారి మందిరమునకు ఆఱు అంతస్థులు. ఆమందిరవైశాల్యము ముప్పదివేల చతురపుటడుగులు. అందు ఏకకాలమున ఇరువది లక్షల గ్రంథసంపుటములు భద్రపఱచుటకు ఏర్పాట్లు గలవు. అమ్మకమునకైన సెకండు హేండు పుస్తకములను ప్రదర్శించుటకు విశాలమగు గదులు. ప్రఖ్యాతగ్రంథకర్తలు వచ్చి ఉపన్యాసము లిచ్చుచుండుటకు ఒక పెద్ద హాలు.

తమకంపెనీ స్థాపించిన ఇరువదియైదేండ్లయనంతరము 1929-వ సం॥ లో వారు తమ కంపెనీ రజతోత్సవమును గావించుకొనిరి.




౧. పాటలు.

## పాతపాటలు

[మామిత్రులును, 'ఆంధ్రభూమి' పాఠకులకు చిరపరిచితులును అగు శ్రీయుత శేకుమళ్ళ కామేశ్వరరావుగారు (బి.ఏ.,బి.ఇడి) 1931-వ సంవత్సరము ఏప్రియల్ మాసమున సికిందరాబాదులో బాలభాషకు చెందిన పాతపాటలను కొన్ని సేకరించియుండిరి. ప్రచురణార్థము వారు వానిని దయతో మాకొసంగిరి. ఇందుతో వాని క్రమప్రచురణమునకు ప్రారంభించుచున్నాము. —సంపాదకుడు.]

1. ఇసకలో ఆడేటి కుసుమసిరిబాల,
ఆబాలపేరేమి? ఆనవాలేమి?
ఆనవాలు అంబరసా, పేరు బాలయ్య.

2. వెంకటరమణముద్దుల్లు మద్దికాయల్లు
మద్దికాయలుముద్దు మాటల్లుముద్దు
మామల్లచంకను వెంకటరమణముద్దు.

3. పుక్కిళ్లుసన్నాలు భుజకీర్తులు
చెక్కిళ్లు సన్నాలు చెవులు గున్నాలు
కాళ్లును సన్నాలు గజ్జల కడియాలు
వేళ్లును సన్నాలు ముద్దుటుంగ్రాలు.

4. శ్రీరంగంవెళ్ళేటి చిన్నవైష్ణవులు
అదిగో! చూడరయ్య గాలిగోపురము
గుళ్ళోనుచూడరే రంగనాయికులస్వామి
మెడనిండముత్యాలు మేలుపతకాలు
తలనిండ పుట్టువెంట్రుకలు తనరారు రాక
అష్టరావిరేక నొసలు మెరియంగ.

5. రమణయ్య చేతుల్లోది వజ్రాలగిలక
చూచిరే ఆయెలుక చూరున్నపెట్టె
వాసాలబారేటి మీసాలయెలుక
పాపకారియెల్కుక పారెయ్యిగిలక
దోసకారియెలుక దులిపెయ్యిగిలక.

6. పంచదారకుప్ప పాలమీద తెప్ప
మాకు వెంకటరమణయ్య ముద్దు
వరహాలకుప్పందు, వచ్చె ధనమందు.
మామ సత్యం తెచ్చె మాణిక్యాలకంటె
అత్తసీతమ్మ తెచ్చె అద్దాలఅంగి
వెన్నారి ముద్దందు వెలగపండందు.

7. వెలదిరో! వెంకటరమణ యెవరిపట్టందు
కాంతరో! వెంకటరమణ కన్నతల్లందు
ఇచ్చినదేవునిబోలు ఈశ్వరునిబోలు
బ్రహ్మదేవునిబోలు బాలల్లబోలు.

8. పెదమామ తెచ్చిండు పెంచపులిదండ
నడిమిమామ తెచ్చిండు నాగభూషణాలు
చినమామ తెచ్చిండు చిలకల్ల తొట్టె
అవిమావెంకటరమణకుఅమరుకడియాలు.

9. మందలకు పోవయ్య మామ తరిణయ్య
మరవక తేవయ్య మచ్చావుపాలు
అవితెచ్చి మారాజువెంకటరమణకుపోసె.

౨. వినోదకథలు.

# పురోహితబ్రాహ్మడి అదృష్టపు మీసం

అనగా అనగా ఒక బ్రాహ్మడు ఉండే వాడు. వాడికి పొట్టకోసినా అక్షరంముక్క లేదు. కాని వాడు బలేటక్కరి. పొట్టకోసం వాడు ఒక గొల్లగూడెంలో పురోహితుడుగా కుదిరాడు. వచ్చిన రెండుమంత్రాలు గట్టిగా చదివి ఆగొల్లవాళ్ళకు మన బ్రాహ్మడు బాగా చదువుకున్నవాడేను అనే నమ్మకం కలిగేటట్లు చేసుకున్నాడు. ఇంక ఆగొల్లగూడెంలోకి ఏ ఇతర బ్రాహ్మడువచ్చినా .వాడిని ఏవో విషమప్రశ్నలు వేసి విసిగించి తరిమివేస్తూ చాలాగర్వంగా ఉండేవాడు.

ఇల్లా ఉంటూండగా ఒకరోజున ఆగొల్లగూడేనికి ఒకబ్రాహ్మడు వచ్చాడు. వీణ్ణికూడా డబాయించి పంపించేద్దామని మన బ్రాహ్మడు అనుకున్నాడు, పాపం. కాని ఆవచ్చిన బ్రాహ్మడు వీడికంటేను బలేటక్కరి. కాబట్టి సంగతి సందర్భాలు కనిపెట్టి మనబ్రాహ్మడితో వాదుకు సిద్ధపడ్డాడు. ఈవాదన వినడానికి గొల్లగూడెంలోని పురుషులు స్త్రీలు పిల్లలు అంతా ఒకచోట గుమికూడేరు. తమ బ్రాహ్మడు వాదించినపుడల్లా ఆగొల్లవాళ్లు సంతోషంతో చప్పట్లుకొడుతూ హుషారు పుట్టించేవారు.

ఏదో అడ్డదిడ్డం ప్రశ్నవేసి క్రొత్త బ్రాహ్మణ్ణి ఓడగొడదామని మనబ్రాహ్మడు 'గాన్ గార్‌గోర్' అంటే అర్థంఏమిటని అడిగాడు. క్రొత్తబ్రాహ్మడు తన బోడిబుర్రమీద చెయ్యివేసి తడుముకుంటూ చాలాసేపు ఆలోచించి ఇల్లా సమాధానం చెప్పేడు.

'సాయంకాలము కాగా పశువులు పచ్చిక మేసిమేసి ఇంటికి వస్తాయి. అప్పుడు లేగదూడల్ని వదిలిపెడతారు. పాలుపితకడానికి ప్రారంభిస్తారు. వట్టిగిన్నెల్లోకి పాలుపితుకుతూ ఉండగా జుంజుం అనేధ్వని అవుతుంది. కాని గిన్నెలు సగం పాలతో నిండినతరువాత గాన్ గార్‌గోర్ అనేధ్వని బయలుదేరుతుంది.' అని చెప్పి అతడు గొల్లవాళ్ళకేసి తిరిగి 'ఏమర్రా! అవునా? కాదా?' అన్నాడు. ఈ సమాధానం గొల్లవాళ్ళకు బాగా తెలిసింది. అందుచేతనే బాగా నచ్చింది. బేష్ అంటే బేష్ అన్నారు అంతా.

మనబ్రాహ్మడిముఖం పాపం చిన్నపోయింది. ఓడిపోయిన విచారంతో తలవంచుకున్నాడు. క్రొత్తబ్రాహ్మడు గెలిచిన సంతోషంతో ఒళ్లు పరవశమై మనబ్రాహ్మణ్ణి సమీపించి అతని మీసాల్లోవి ఏడువెంట్రుకలు పీకినాడు. దీనిమీద గొల్లవాళ్ళకు చాలా కోపంవచ్చింది. క్రొత్త బ్రాహ్మణ్ణి కొట్టడానికి సిద్ధమయినారు. కాని అప్పు డాబ్రాహ్మడు కొంచమేనా భయపడక చమత్కారంగా 'ఈబ్రాహ్మడి మీసపు ప్రతి వెంట్రుకలోను అదృష్టం రాసులురాసులుగా వుంది. ఈ వెంట్రుక ఒకటైనా కలిగివున్నవారికి చాలా అదృష్టంపడుతుంది. అందుకనే నేను ఏడు వెంట్రుకలు పీకి పుచ్చుకున్నది' అన్నాడు.

వెఱ్ఱిగొల్లవాళ్లు ఈవిషయం నమ్మారు. అందరూ ఎగబడి ఆబ్రాహ్మడి మీసాల్లోన్ని వెంట్రుకల్లో తలఒకటేనా పొందడానికి పెనగులాడి పీకులాడ్డం ప్రారంభించారు. ఒక్క వెంట్రుకేనా లేకుండా ఆబ్రాహ్మడి మీస

కట్టు అంతా లాగివేయబడింది. ఈబాధకు తాళలేక పాపం అతగాడు మూర్ఛపోయాడు.

ఆవూరి గొల్లవాడు ఒకడు ఇంతసేపూ ఏదో పనిమీద ఎక్కడికో వెళ్ళిఉండి ఆసమయంలో అక్కడికి వచ్చాడు. అతన్నిచూచి అతనిపెళ్లాం మండిపడి 'సమయానికి లేకపోయావు. ఆబ్రాహ్మడి అదృష్టపుమీసంలోనుంచి అందరూ తలోవెంట్రుకా పీకి తెచ్చుకున్నారు. నీవంటి నిర్భాగ్యుడికి అట్టివెంట్రుక ఎల్లాలభిస్తుంది' అని అంది. అందరికీ దొరికి తనకు లేకపోయింది అనడంతోటే ఆగొల్లాడికీ పాపం బెంగపట్టింది. కొత్తబ్రాహ్మడి దగ్గరకు వెళ్ళి తనబెంగ చెప్పుకుని తనకు అదృష్టంకలిగే సాధనం చెప్పమన్నాడు. మీసాల వెంట్రుకలు గొల్లవాళ్లు పీకేశారు. తలమీద గోష్పాదమంతజుట్టుతప్ప మిగతాభాగం అంతా నున్నగావుంది. ఇదిచూసి క్రొత్తబ్రాహ్మడు నువ్వు ఆబ్రాహ్మడి పిలకలాక్కుపో,నీకు నిండా అదృష్టం కలుగుతుంది అన్నాడు.ఆగొల్లాడు ఆమాటవిని ఎగిరి గంతేసి ఆపిలక క్రాస్తా పీక్కుపోయాడు.

పాపం ఆబ్రాహ్మడు అట్లాగే తెలివితప్పి పడివున్నాడు. చూడగా చూడగా ఆగొల్లవాళ్ళకుకూడా జాలివేసింది. అతనికి తిరిగి తెలివికలగడానికి ఏమిటి సాధనం అని వాళ్లు ఆలోచన ప్రారంభించారు, క్రొత్తబ్రాహ్మడికి ఆబ్రాహ్మడిమీద కసి యింకా తీరక ఇంకా అతణ్ణి ఏడిపించ తలచి ఆగొల్లవాళ్ళను 'మీ ఎడ్లకు దొమ్మవచ్చి పడిపోతే అవి తిరిగి లేవడానికి ఏమిచేస్తారు?' అని అడిగాడు. 'వాతలుపెడతాం'అని ఆగొల్లలందరూ అన్నారు. 'ఇతనికి తిరిగి తెలివిరావడాని కయినా అదే చెయ్యాలి' అని క్రొత్తబ్రాహ్మడు అన్నాడు.

వెఱ్ఱిగొల్లలు ఆమాటనమ్మి ఇనపగరిటిచిప్ప ఎఱ్ఱగాకాల్చి బ్రాహ్మడి కణతల మీద వాతలు పెట్టినారు. దాంతో బ్రాహ్మడు ఉలికిపడి లేచి తలమీద పిలకఉండే చోట చేతితో తడుముకున్నాడు. కణతలకు బదులుగా వాత నడినెత్తిని పెట్టిఉండవలసిందేమో బ్రాహ్మడు చెయ్యి అక్కడికి పోనిస్తున్నాడని ఆగొల్లవాళ్లు అక్కడకూడా ఒకవాత పెట్టారు.

తనకు గొల్లవాళ్లు వాతమీదవాత పెట్టడంచూచి భయపడిపోయి ఆబ్రాహ్మడు పరుగు లంకించుకున్నాడు. తిరిగి ఎప్పుడూ ఆగొల్లగూడెంకేసి కన్నెత్తి చూడలేదు. తరువాత ఆగొల్లగూడెంలో అతనిస్థానంలో కొత్త బ్రాహ్మడు పురోహితుడుగా కుదిరేడు.

# మన క్రొత్త చక్రవర్తిని గూర్చిన కొన్ని కథలు


రచయిత :

హాలుడు, బి. ఏ., బి. ఇడి.


మనచక్రవర్తియగు అష్టమయెడ్వర్డు సార్వభౌముని వయసు 42 సంవత్సరములు. అతి విశాలమగు తన సామ్రాజ్యమందలి వివిధ భాగములకును బోయి అందలిస్థితిగతుల నాలోకించెను. రాజ్యనిర్వహణమున కవసరములగు సమస్తవిషయములను కూలంకషముగ నెరింగిన విజ్ఞాని. తనప్రజల మన్ననలనేగాక ప్రేమనుగూడ చూరగొనిన సహృదయుడు.

యువరాజుగా నున్నపుడు విధి విరామములు లేకుండ పనిచేసెను. దక్షిణ ఆఫ్రికాను చూడబోయినపుడు ఒకరోజులో మూడువేల మందితో కరస్పర్శ చేయవలసివచ్చెను. దాని ఫలితముగా అతని కుడిచేయి వాచి పనిచేయుటకు వీలులేకుండ బోయెను. కాని తనకార్యనిర్వహణమునందు విరామమును చూపలేదు.

ఈదక్షిణఆఫ్రికా సంచారమున నతనికొక విచిత్రానుభవము కలిగినది. ఒక పోలీసు ఉద్యోగితో కలసి యువరాజు మోటారును నడుపుకొనుచు రోడ్డుపై పోవుచుండెను. కొంతదూర మేగుసరి కొక పోలీసుమనిషి కారును ఆపవలసినదని సైగచేసెను. యువరాజు కారునాపెను. 'ఇప్పు డీరోడ్డుమీద యువరాజు మోటారు రానున్నది. ఆకారు వెళ్లువరకు మీకారును రోడ్డుప్రక్క నాపండి. లేదా యీమార్గంవదలి ఆప్రక్కమార్గాన పోవండి' అనుచు చుట్టుత్రోవ నొకదానిని చూపెను. అంత కారులోని యుద్యోగి ఆకారునడపునది యువరాజేయని అతనితో చెప్పెను. కాని తన ధర్మనిర్వహణమున యంత్రమువలె పనిచేయుట మాత్రమే యెరింగిన ఆపోలీసు 'అయ్యా! యెందు కీమాటలు. అందరూ యిల్లాచెప్పే తప్పించుకుని పోతారు. ప్రక్కకు తప్పుకుని ఆగండి' అన్నాడు. యువరాజిదియంతయు చూచుచు మందస్మితుడై యుండెను. ఇంతలో కాన్స్టబులు దృష్టి మరొకదిక్కుగా ప్రసరించుటచే యువరాజు తనకారును శరవేగమున పోనిచ్చి తప్పించుకొనెను. యువరాజురాకకు వేచియున్న ఆపోలీసు వచ్చిన యువరాజును గుర్తించలేక పప్పులో అడుగువేసినాడు.

ఇట్టిదే మరొకవిషయము జరిగెను. యువరాజు తన అనుచరునితో గలసి ఒకమేడవద్ద లిఫ్ట్ కొరకు వేచియుండెను. అంత నొక బాలుడువచ్చి 'ఈకాగితాలు కొంచెంసేపు పట్టుకోవ్వూ? పైకెళ్ళి యజమానిని చూసి వస్తాను' అనుచు కాగితముల నాతనిచేత నునిచి వెడలెను. యువరాజు తన సహజ మందస్మితముతో వాని నందుకొనెను. అనుచరుడు తెల్లబోయెను. కొంతసేపటికి ఆబాలుడు తిరిగివచ్చి 'మీకు నమస్కారాలు' అంటూ కాగితములు తీసికొని వెడలిపోయెను. తనకాగితములను పట్టుకొని నిలచినది

యువరాజని ఆబాలునకు తెలియనే తెలియదు.

మన సార్వభౌముని హృదయము కడు మార్దవము. ఒకమారు ఒకానొక యందవతి యువరాజుతో గలసి విందారగింప నభిలషించెను. ఈవిషయము మరొకయామె గ్రహించి మొదటియామెను ఏడ్పింపనెంచెను. యువరాజు మన్ననకు పాత్రురాలగు నొక యాపెచిరునామాగల కాగితమును గ్రహించి 'మాయింటజరుగు విందునకు యువరాజు ఆహుతుడు, నీవును రావలెను' అని ఆహ్వానమును వ్రాసి మొదటియామెకు పంపెను. చిరకాల వాంఛితము నెరవేరెనుగదా యని ఆమె మిక్కిలి సంతసించి ఆనాడు అలంకృతయై వెళ్ళెను. కాని ఎవరిపేరిట పిలుపువచ్చెనో ఆమె గ్రామములో లేనేలేదు. ఆశాభంగమున కామె మిక్కిలి ఖిన్నురాలాయెను. ఈ పన్నాగమునకు కారకురాలగు నామె యీ విషయము యువరాజునకును తదితరులకును గూడ తెలియునట్లు చేసెను. అది విని యువరాజు మిక్కిలి సానుభూతికలవాడై తన స్నేహితులద్వారా కబురుచేసి ఆఖిన్నురాలిచే విందిప్పించి దానికి తాను హాజరై యామె మనస్సునకు సంతోషమును గూర్చెను. అఖండసామ్రాజ్యాధిపతికి అంతటి కోమలహృదయముండుట బంగారమునకు తావియబ్బుటే.

ఇప్పటి మనరాజునకు వేట, మోటారు నడపుట, పడవనడపుట, ఆకాశయానము మిక్కిలి అభిమానపాత్రములగు క్రీడలు. గోల్ఫు ఆటలో నేర్పరితన మున్నది. దానియందభిమానముకూడ లెస్స. క్లబ్బులలో జేరి కాలయాపనము చేయుటలోగూడ నభిలాష గలదు. కాని రవియస్తమింపని విశాలాంగ్ల సామ్రాజ్యనిర్వహణభారము వహించిన యనంతర మిప్పుడిట్టి పనులకు తగినకాలము అతనికి బొత్తిగానుండదు.

అతనికి ఒక మేనకోడలు, ఇద్దరు మేనల్లుళ్లుగలరు. వారిని చూడబోయినపుడు వారికి బహుమతులను గొనిపోవువాడు. వారనిన నాతనికి ప్రేమమెండు. వారితోగలసి బాలునివలె నాడుకొని యానందించువాడు. ఒకమారు వారు మేనమామను తమతో 'మంటలార్పుట' అను ఆటనాడుకొందము రమ్మనిరి. యువరాజటులే యనెను. మేనమామను గడ్డికొట్టాముపై నెక్కుమనిరి. నిచ్చెనవేసికొని ఎక్కెను. గడ్డికొట్టము అంటుకొను చున్నది అనుచు పిల్లలు నీటిపంపునుండి నీరాతనిపై వదలజొచ్చిరి. యువరాజుతడసిపోయి శీతకాలమగుటచే వడకుచుండెను. కాని వారు నీరువదలుట మానలేదు, తప్పించుకొను వెరవు యువరాజునకు చూపట్టక వారి జలధారనెదుర్కొని నిచ్చెనవద్దకువచ్చెను. కాని ఆ పిల్లలానిచ్చెన నదివరకే తీసివేసిరి. యువరాజు వారిని కఠినముగ శిక్షింతునని బెదరించెను; వారు జంకలేదు. లంచములిత్తుననెను; వారాసించలేదు. కనుక చేయునదిలేక అచటనే నిలచెను. ఆయెత్తునుండి క్రిందకుదూకి తప్పించుకొమ్మని సలహానిచ్చిరి. కాని అది ప్రమాదకరమగుటచే నత డట్లు చేయలేదు. కొంతసేపటి కెవరో అదిచూచి పిల్లలయాగడమును మాన్పించి, యువరాజును క్రిందికి దింపిరి. ఈతీరున యువరాజు ఆపిల్లలతో 'పులిమేక' మొదలగు ఆటలనాడి యానందించువాడు. పిల్లలనిన అతనికి ప్రేమమెండు. వారలతో కలసిమెలసి తిరుగును. వారి చిలిపి పనులను సహింపగల యోర్మియు, వారి యెత్తులు గ్రహించి పనిచేయగల నిపుణతయు అతని సొమ్ములు.

# ఆంధ్రభూమి బుక్కుడిపో — వేపేరి, మదరాసు

## విపంచి — 80 పుటలు — నాలుగు అణాలు.

తమ మృదుమధురరచనములచే నవ్యాంధ్రభారతిని సేవించుచున్న యువకవులలో నొకరగు శ్రీయుత బొడ్డు బాపిరాజుగారి మధురకావ్యముల సంపుటి. పత్రికలు, ప్రముఖులు విశేషముగ కొనియాడినది. ముద్దులమూట. రసములఊట. పాలతెల్లని ఆంటిక్ కాగితములు. నాలుగైదు రేఖాచిత్రములు. మొత్తమున కొక అందముల బరిణె.

## వైద్యయోగరత్నావళి — 382 పుటలు — రెండు రూపాయిలు.

మద్రాసు సెంట్రల్ బోర్డు ఆఫ్ ఇండియన్ మెడిసిన్ మెంబరు బ్రహ్మశ్రీ పండిత ములుగు రామలింగయ్యగారిచే సంపాదితము. ఇందు గవర్నమెంటు 1929 వ సంవత్సరపు జీ. ఓ. 2411 నెం. గల పుస్తకమందు సర్వప్రకరణములను చేయుపద్ధతి వివరముగ వ్రాయబడినవి. సాంప్రదాయ యోగములు, అవసరమైన పరిభాష చేర్చబడినవి. ఆయుర్వేద మెడికల్ ఆఫీసర్లకు, ఫార్మశీల వారికి మిక్కిలి ఉపయోగమయినది. చాల పరిశ్రమచేసి వ్రాసిన గ్రంథము. ఇండియన్ మెడికల్ స్కూలు ప్రిన్సిపాల్ శ్రీయుత వైద్యరత్న కెప్టెన్ జి. శ్రీనివాసమూర్తిగారి పీఠికతో అలరారుచున్నది. చక్కని గ్లేజు కాగితములు.

## రామప్రియ — 150 పుటలు — పండ్రెండు అణాలు.

ప్రసాదమయిన హాస్యమునకు పేరు కెక్కిన తాత కృష్ణమూర్తి (బి.ఏ., యల్.టి) గారిచే సులభశైలిని వ్యవహారికభాషలో వ్రాయబడిన స్వతంత్రకల్పనాకథలపుస్తకము. 'కథల్లు మిక్కిలి ముచ్చట లూరుచున్నవి' అని పత్రికారాజమగు భారతి, 'హాస్యరసగర్భితము'! అని విశేష ప్రచారముగల వినోదిని పత్రికయు ప్రశంసించినవి.

## తర్కసంగ్రహము — పోకెట్ సైజ్ — ఒక రూపాయి.

తర్కశాస్త్రపారంగతుడగు అన్నంభట్టు సులభార్థబోధకముగ సంస్కృతములో రచియించిన గ్రంథమునకు ఆంధ్రతాత్పర్యమును రచించి చరకమతదీపికాఖ్యాయుర్వేదమతవివరణముతో ఆయుర్వేదాచార్య డాక్టరు ములుగు విశ్వేశ్వరశాస్త్రి, యల్.ఐ.యమ్.; హెచ్. పి.ఐ.యమ్ గారు వెలువరించియున్నారు. ఆయుర్వేదమునకు అత్యావశ్యకమయిన పదార్థవిజ్ఞానపటము కూడ కలదు. ఆయుర్వేదానుబంధముతో వ్రాయబడిన ఈగ్రంథము ప్రతి ఆంధ్రాయుర్వేద వైద్యునకు ఎంతయు ఉపకరించుటయేగాక ఆంగ్లలాజిక్ విద్యార్థులుకూడ చదువతగినది.

## కామశాస్త్రము — 150 పుటలు — ఒక రూపాయి.

ఇది వాత్స్యాయన మహర్షి సంస్కృతభాషలో వ్రాసిన సూత్రములకు కొత్త సత్యనారాయణ చౌదరిగారు గావించిన చక్కని తేటతెల్లమగు తెలుగుసేత. రైలులోఅమ్ము పుస్తకాలవంటిది కాదు. సరియైన శాస్త్రగ్రంథము. కామపురుషార్థమునకుగల ప్రాముఖ్యము, ప్రాభవము ఇది చదివినచో తెల్లమగును.

# ఇన్స్యూరెన్సు విషయములు

## జీవిత భీమా అనగా నేమి?

[పాఠశాలలయందును కళాశాలలయందును జీవితభీమాశాస్త్రము బోధింపబడ వలయును.]

విద్యాసముపార్జనమునందు నేను నాజీవితమున పదునాలు సంవత్సరముల దీర్ఘకాలమును వెచ్చించితిని. కాని జీవితభీమా అనగా నేమియో నాకు తెలియదు. నేను ఉద్యోగమున కాలిడుచున్నాను. తోడనే నన్ను ఎందరో భీమాఏజెంట్లు చుట్టుముట్టుదురు. వారు దీర్ఘములగు ఉపన్యాసముల గావించుచు నడుమ నడుమ కొన్ని ప్రశ్నల జారవిడుతురు. జీవిత భీమాశాస్త్రముతో నాకు బొత్తిగా పరిచయము లేని కారణమున నే నాప్రశ్నలకు తగు సమాధాన మీయలేక పోవుదును. అయినను పట్టభద్రుడనగుటచే అజ్ఞానము ఒప్పుకోక తెలిసినట్లు నటింతును. నిశితప్రతిభుడగు భీమాఏజెంటు నాస్థితిని తోడనే గ్రహించును. అందుతో అవమానభరము అగ్గలమై నేను వినమ్రుడనగు నంతలో అతడు ప్రజాసామాన్యమున జీవితభీమాను గూర్చి అంతుదరిలేని అజ్ఞానము ప్రబలియున్నదనియు మన విద్యావిధానమున భీమాశాస్త్ర బోధనము లేకుండుట యొక్క గొప్పలోపమనియు చెప్పి నా హృదయభారమును కొంత తగ్గించును.

నేడు మనపాఠశాలలలో బోధింపబడు చరిత్ర, భూగోళము, వివిధభాషలు, ఆల్జిబ్రా, జామిత్రి మొదలగువానికంటె భీమాశాస్త్రబోధనము ఎక్కువ వాంఛనీయమైనది, లెస్సగ అక్కరకు వచ్చునది. నేటి విద్యావిధానము విద్యార్థులను సర్వదా స్వప్నలోకమున ఉంచుచున్నది. పట్టభద్రుడనగుటకు నేనెంతయో కష్టపడితిని. పట్టముపొందిన తరువాత దానికొరకు నేను పడిన కష్టమంతయు వృధాయనిపించుచున్నది. ఈ పట్టముకొఱకు నేను శారీరక మానసిక శక్తుల ధారపోసితిని. అయినను ఈపట్టమువలన పట్టెడుమెతుకులు ఆర్జించలేక పోవుచున్నాను. పోనీ స్వతంత్రముగ నేదైన వ్యాపారము చేయుదమను కొంటినా వ్యాపారమునకు అతిముఖ్యములగు ఎక్కవుంట్లను గూర్చిన జ్ఞానము నాకు బొత్తిగా లేదు. పట్టభద్రుడనయ్యు నేను విచిత్ర ప్రపంచమున నిలబడుచున్నాను. ఎట్లో కష్టపడి ఏదేని ఉద్యోగమును సంపాదించితినా భీమాఏజెంటువచ్చి నాజీవితమును భీమాచేయుమని బోధించును. భీమాయు నాకు తెలియదని ఒప్పుకొనకతీరదు. ఇట్లే ప్రతిదినమును నేను తెలియని విషయముల నెన్నిటినో ఎదుర్కొనవలసివచ్చుచున్నది. ఈ పరిస్థితులలో ధైర్యమువహించి ఆయావిషయములను తిరిగి నేర్చుకొనుట తప్ప గత్యంతరము లేదని నేను తెలిసికొనుచున్నాను.

ఇంతకును ఇన్సూరెన్సు ఏజెంటు ఏమి నేర్పుచున్నాడు ? మానవుని మేధ సృష్టించిన వ్యవస్థలలో ముండ్లులేకుండ గులాబీలు ఇచ్చు వ్యవస్థ జీవితభీమాయే. జీవితభీమా ప్రయోజనముల పాతర. దాని ప్రయోజనములతో కలిసి ఎట్టి అసౌకర్యములుగాని లేవు. అది వ్యక్తులకు, జాతులకు, సమగ్రమానవలోకమునకు సహాయముగావించును. అది దేనినిగాని కష్టపెట్టదు. జీవితపథమున గమనమును అది శాంతమైనదిగా, సుకరమైనదిగా, సులభమైనదిగా చేయును.

'జీవితభీమా పద్ధతిలో వ్యక్తులు నియమప్రకారము ప్రీమియములనబడు కొన్ని చందాలను ఈయవలసి యుండును. ఇట్లు చందాలనిచ్చుదానికి ప్రత్యామ్నాయముగ వారి మరణానంతరముగాని వృద్ధాప్యమునగాని కొంత సొమ్మును బడయుటకు వారు హామీని పొందుచున్నారు. భీమాచేసిన వ్యక్తిదృష్టితో చూచితిమేని అతడు అకాలమరణమునకు పాల్పడుచో తానుకట్టినవి కొద్ది ప్రీమియములే అయినను భీమాచేసిన మొత్తమును పొందుటవలన విశేషలాభమును బడయుచున్నాడనవచ్చును. భీమాచేసియున్నచో మరణమువలని భయము అంత తీక్ష్ణమైయుండదు. ఏమన తాను ఎవరికొఱకు ఇపుడింత కష్టపడుచున్నాడో అట్టి తన భార్యయు, బిడ్డలును తన మరణానంతరము కొంతధనమును నిశ్చయముగ పొందగలరుగదాయను ధైర్యమాతనికుండును. తాను ఏర్పఱచిన భీమాధనమును పొంది తన ఆలుబిడ్డలు స్వతంత్రముగ బ్రతుకగలరు. అగుట వారు ఇతరుల పోషణకు ఆశించి ఆ ఇతరుల నూటిపోటు మాటలకు గుఱికావలసిన అవసరముండదు. అకాలమరణమునకు పాల్పడక అతడు పూర్ణపురుషాయుషజీవియైమనుచో అతడు యథాకాలమున భీమాచేసిన మొత్తమును పొందుచున్నాడు. పైగా బోనస్‌లని పిలువబడు లాభములను గూడ బడయుచున్నాడు. ఇవి అతని ఆర్జనశక్తి తగ్గియుండు వృద్ధాప్యకాలమున కందిఅతని అక్కరకు వచ్చుచున్నవి. నియమప్రకారము ఇట్లు ప్రీమియములు కట్టియుండకపోయినచో అతడిట్టి పెద్ద మొత్తమును కూడబెట్టుట దుస్తరమే. జీవితభీమా అతనిచే ఈ మొత్తమును నిర్బంధముగా కూడబెట్టించినది.

వ్యక్తియేకాదు జాతికూడ జీవితభీమా విధానమువలన విశేషలాభమును బడయుచున్నది. పెక్కు వ్యక్తులు తాము కూడబెట్టిన ధనమును జీవితభీమావిధానమువలన తగుమైన లాభకరమైన ప్రచారమున పెట్టుచున్నారు. 'సమష్టిగానున్నచో మనము అజేయులము. వ్యష్టిలో అంతయు వ్యత్యస్తమే' అను నానుడి జీవితభీమావిధానమున మరిదేనియందు కంటెను విశేషముగ విస్పష్టమగుచున్నది. ఒక్కొక్కడు ఒక్కొక్క రూపాయి చొప్పున ఒక కోటిమంది కట్టు ప్రీమియములు ఒక గొప్ప ధనరాశిని గూర్చుచున్నవి. ఆపెద్ద మొత్తము ఒక బ్రహ్మాండమగు పరిశ్రమను నెలకొల్పి ఒక జాతి జాతికంతకును మృష్టాన్నమిడగలుగుటకు వీలుకల్పించుచున్నది. ఒక జాతియందలి వ్యక్తులకు జీవితభీమా భేదింపరాని సాముదాయకస్థితిని కల్గించుచున్నది. ప్రభుత్వములకు, పారిశ్రామికసంస్థలకు దీర్ఘకాలపు అప్పులయొక్క అవశ్యకత యెంతేని గలదు. బ్యాంకులు మొదలగు సంస్థలు ఇట్టి దీర్ఘకాలపు అప్పులనిచ్చుటకు ఎల్లవేళల సమర్థములుగావు. ఇన్సూరెన్సు కంపెనీలు ఇట్టి దీర్ఘకాలపు ఋణముల నిచ్చుట కెంతేయు సమర్థములైనవి. ఈ విషయమై బ్రిటీష్ ఆ

ర్థికశాస్త్రవేత్తయగు ప్రొఫెసర్ డి. మార్గన్ ఏమిచెప్పుచున్నాడో చూతుము : 'కట్ట కట్టుకొని ఒక్కసారిగా పెక్కు క్లెయిములు వచ్చుటచే ఎన్నియో బ్యాంకులు విలుప్తమైనవి. ఇన్సూరెన్సు కంపెనీల విషయమున ఇట్లు ఒక్కసారిగా పెక్కు క్లెయిములు వచ్చునని భయపడుటకు అవకాశ మెంతమాత్రమును లేదు. పట్టాదారుల చావువలని నష్టములు ఇన్సూరెన్సు కంపెనీకి ఎడపదడపయు, క్రమమునను, సాధారణముగ కాలనియమము ననుసరించియు వచ్చుచుండును. రాగల వత్సరములలో క్లెయిములకుగాను ఇంతటి మొత్తమును ఈయవలసియుండునని సుమారుగా అంచనా కట్టుట యొక కష్టముగాదు.

జీవితభీమా విధానమున ఒక గొప్ప ధార్మికగుణము ఇమిడియున్నది. తాము ఎఱిగియుండని, చూచియుండని పట్టాదారుడొకడు మృత్యుదేవత వాల్పడినపుడు భీమాకంపెనీ ఇతని కిచ్చు ధనము బ్రతికియున్న ఇతర పట్టాదారుల ప్రీమియములవలని వడ్డీనుండి గ్రహించినదేయనుట ఎల్లరును సులభముగనే గ్రహింతురు. బ్రతికియున్న పట్టాదారులు ఈ రూపేణా కొంతనష్టపడుచున్నారనుట నిశ్చయమే. తన జీవితమును భీమాచేయకయే ఒకడు చనిపోయినాడనుకొందము. ఆతని అనంతరము ఆతని ఆలుబిడ్డల పోషణభారము బ్రతికియుండు ఆతని బంధువులపై పడును గదా? అట్టి భారము ఒక్క బంధువుల మీదనే పడకుండ జీవితభీమా ఆభారమును పట్టాదారుల అందరిమీదను మోపుచున్నది. అనగా ఏమన్నమాట? ఒక భీమా పట్టాదారు అనుకోకయే తాను అనాథస్త్రీలకు, అనాథ శిశువులకు యథాశక్తిని ధనసహాయము చేసిన దాతయగుచున్నాడు. అయినను భీమాచేయువారు సాధారణముగా భీమాపట్టావలన తమకు ఆర్థికముగా కలుగు లాభముల నుపలక్షించియే చేయుచున్నారుకాని విశాలవిశ్వమునకు తాము యథాశక్తిని ఉపకారముచేయుచున్నామను ఉదారభావముతో చేయుటలేదు. కావున దీనిని అనుకోని దానమనుట కంటె లోభదృష్టిగల దయాళుత్వమనుట లెస్సగ నుండును. యజమాని చావువలన అనాథలుగ చేయబడిన స్త్రీలను బిడ్డలను పోషించుటకు యథాశక్తిని తోడ్పడుటకంటె చేయదగు విశేష ధర్మకార్యము మఱియొకటి ఏమిగలదు? తమకు ఆహారము కూర్చిపెట్టువాడు మృత్యుదేవతచే క్రూరముగ కొనిపోబడిన కష్టకాలమున ఒకానొక కుటుంబమువారికి భీమాకంపెనీలవారొసగు ఆర్థిక సాహాయ్యము హెచ్చు విలువకలదియగుచున్నది. వైద్యశాస్త్రజ్ఞానమున మనము ఇపుడు విశేషాభివృద్ధి నందియున్నను మృత్యుదేవత వీరవిహారమును అరికట్టలేకపోవుచున్నాము. అయినను భీమాసంస్థలవలన మృత్యుదేవతయొక్క వీరవిహారమువలని దుష్ఫలితములను మనము సమష్టిగా ఎదుర్కొని వాని తీక్ష్ణతను తగ్గింపగలుగుచున్నాము.

నేటి నాగరిక ప్రపంచమునకు జీవితభీమా వ్యవస్థ యొక వరప్రసాదమగుట సునిశ్చయమగుచున్నది. అనాథస్త్రీలకు, అనాథ శిశువులకు అది గొప్పసాయము గావించుచున్నది. సంపదను కూర్చుచున్నది. వంతులవారిగా మన అందరికష్టములను తగ్గించుటకు సాధనమగుచున్నది. భీమావిధానములేని నేటి నాగరికత అంతయు యథాయథలగుచున్నది. జీవిత భీమా చిరము వెలయుగాక!

—హార్‌బన్సయల్. రంగారాణి, బి.ఏ.

—The Indian PolicyHolders' Review.

# జిజ్ఞాస — మీమాంస

విజ్ఞానసంపాదనావసరమున వివిధవిషయములందు కలుగు సందేహములను నివారించుకొన పత్రికాముఖమున జిజ్ఞాస సలుపుటకును— ఇందలి ఏ ఒక్క జిజ్ఞాసకైననుసరే సరియైన సమాధానము తెలిసియున్నచో దానిని కూడినంత సంగ్రహముగ వ్రాసి, ప్రచురణార్థము పంపుటకును ఆంధ్రభూమి పాఠకులను ప్రార్థింతుము. —సంపాదకుడు.

### ౭౯. బల్లిపాటు ఫలాలు

బల్లిపతనానికి రాసేఫలాలు స్త్రీపురుష సామాన్యాలా? లేక పురుషులకొక్కరికేనా? బల్లిపడుటలో అందరికీ దోషముండడం భావ్యంకనక స్త్రీలకుకూడా వుండాలిగదా? అల్లా అయితే 'వామహస్తే స్త్రీసంభోగః' అనేది ఎట్లుకుదురుతుంది?

—కావలి శ్రీరామమూర్తి.

### ౮౦. పిల్లలకు కలినీళ్లు చల్లడం.

ఆంధ్రదేశమున తల్లిగర్భమునుండి ఉద్భవించిన వెంటనే శిశువుపై కలి (బియ్యము కడిగిన నీళ్ళను) చల్లెదరు. ఈ ఆచారము ఇతరదేశీయులందు కలదా? —పప్పు నర్సిరెడ్డి.

### ౮౧. దేవాలయములపయి బొమ్మలు

పూర్వమునుండియు మన హిందూదేవాలయములపై అవినీతికరములగు ప్రతిమలను చిత్రించు ఆచారముగలదు. పవిత్రమైన ఈ దేవాలయములపై ఇట్టి అవినీతికరములగు ప్రతిమ లుండవలయునని సమర్థించుచు శిల్పశాస్త్రమునందు గలదా?

—గొలుగూరి వీరారెడ్డి.

### ౭౮. పురుషుల పునర్వివాహము - తన్నిషేధము

పురుషుల పునర్వివాహము రెండువిధములు: (1) భార్యయుండగనే జరుగు వివాహము, (2) భార్య చనిపోయినపిమ్మట జరుగు వివాహము. ఇందు మొదటిది కొన్ని సందర్భములలో నిషిద్ధము. భార్య సంతానవతియు ధర్మయుక్తయు నగుచో మఱొకతెను వివాహమాడుట నిషిద్ధమని ఆపస్తంబ ధర్మసూత్రము చెప్పుచున్నది.

ధర్మప్రజాసంపన్నే దారే నాన్యాం కుర్వీత. (2-11-12) ఆహితాగ్నియైనవాని కీనియమములో నొక విశేషముకూడనున్నది. వాని భార్యకు సంతానము, ధర్మము ననువానిలో నొకటియుండి మఱొకటి లేకపోయినను గూడ వాడు పునర్వివాహము చేసికొనరాదు.

అన్యతరాభావే కార్యా ప్రాగగ్న్యాధేయాత్ (2-11-12).

భార్య యెంతకాలము సంతానములేనిదిగ నుండుచో భర్త పునర్వివాహము చేసికొన వచ్చునన మనుస్మృతి యెనిమిదేండ్ల కాలనియమమును చెప్పుచున్నది.

వంధ్యాష్టమేఽధివేద్యాబ్దే. (9-81)

ఇట్లు పునర్వివాహము చేసికొనుటయన మొదటిభార్యను వదలివేయుటకాదు; మొదటి భార్యతోడి దాంపత్యము నశింపదు. ధర్మయుక్తయగు భార్యను వదలివేయువానికి బోధాయనుడు దారుణశిక్షను విధించినాడు.

ఇక భార్య మరణించినపిమ్మట పునర్వివాహము చేసికొనుట నేధర్మగ్రంథమును నిషేధించుటలేదు. కాని యాయువులోని మూడవ భాగము (అనగా నేబదవ సంవత్సరమునుండి డెబ్బదియైదవ సంవత్సరమువఱకు) వానప్రస్థాశ్రమములో నుండవలసినదిగ స్మృతులాదేశించుటచే నేబదియేండ్లు నిండినవానికి భార్యపోయినను పునర్వివాహప్రసక్తి లేదని స్మృతికారుల యభిప్రాయమైనట్లు తెలుచున్నది.

—జటావల్లభుల పురుషోత్తము, ఎం. ఏ.



స్త్రీలు పూజింపబడుచోట దేవతలు క్రీడింతురు.



# మహిళాలోకము

## శిశుశిక్షణ—పిల్లలు యేల కల్లలాడెదరు?

పిల్లలను కల్లలాడకుండ చేయుట యనునది శిశుశిక్షణవిధానమున మిక్కిలి కష్టమైన పనులలో నొకటి. తల్లిదండ్రులయు, శిశువులయు మనస్తత్త్వములను గూర్చి చిరకాలము దీక్షతో పరిశోధించిన డాక్టర్ మార్గరెట్ జి. థాక్రా బ్రిటిష్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హైజిన్ మందిరమున ఉపన్యసించుచు 'పిల్లలు ఏల కల్లలాడెదరు?' అను విషయమును గూర్చి క్రింది విషయములను వెలిబుచ్చెను.

భయము, లోపభూయిష్ఠమైన శిక్షణము—అను ఈరెండే పిల్లలు కల్లలాడుటకు మొదటి కారణములు.

పిల్లలు కల్లలాడుచుండుచో ఆశిశువులను శిక్షించి లాభములేదు. ఆశిశువుయొక్క తలిదండ్రులనే కఠినముగ శిక్షింపవలయును. బిడ్డ చెడుగైనచో తప్పు తలిదండ్రులదే.

బిడ్డ తులువతనమున ప్రవర్తింప నారంభించెననుకొనుడు. ఆతులువతనమును తాము గుర్తించినట్లు తలిదండ్రులు వ్యవహరింపరాదు. ఆతులువతనమును గుర్తించి దానిని నిరోధించుటకు తలిదండ్రులు కొంత శ్రద్ధ వహించిరా బిడ్డకు తన అల్లరిమూలముననే తాను తన తలిదండ్రుల దృష్టి నాకర్షింప గలిగితిని గదా యను భావము ఏర్పడును. అప్పటినుండియు అట్టి తులువతనము మూలముననే తన మాతాపితల దృష్టిని ఆకర్షించుటకు బిడ్డ ప్రయత్నించును. తులువతనమును పోగొట్టుటకు మంచిమందు దానిని బొత్తిగా విస్మరించుటయే కాని ఏమాత్రమును గుర్తించుట కాదని ప్రతితల్లియు, ప్రతి తండ్రియు తెలిసికొనుట అతిముఖ్యము.

సరియైన కాలమున ప్రారంభించుచో శిశుశిక్షణము ఒక దుస్తర కార్యము కాదు. అయితే శిశుశిక్షణము ప్రారంభించుటకు సరియైన కాలముఏది? శిశువుపుట్టిననాటినుండియే క్రమశిక్షణమునకు ప్రారంభింపవలయును.

బిడ్డ ఏవిషయమునుగూర్చియైన ప్రశ్నించు ననుకొనుడు. ఆవిషయము తెలిసియున్నచో తలిదండ్రులు తగుసమాధానమిచ్చి బిడ్డయొక్క కుతూహలమును పోషింపవలయును; ఆవిషయము వారికి తెలియనిచో తలిదండ్రులు తెలియదని ఒప్పుకొనవలయునే కాని సత్యదూరములైన సమాధానములను ఈయరాదు.

ఏవిషయమునుగూర్చి బిడ్డకు చెప్పవలసి వచ్చినను తేట తెల్లమగు మాటలతో, తేలికగ తెలియు భావములతో తెలియజెప్పవలయును. కొత్త సందేహములకు అవకాశమిచ్చునట్లుగ మాత్రము ఎంతమాత్రమును చెప్పరాదు. ఏవిషయమునుగూర్చియైనను

చిన్నతనమున తప్పుడు అభిప్రాయము కలుగుచో ఆ అభిప్రాయమును తొలగించుకొనుటకు పెద్ద ఎదిగినతరువాతకూడ దుస్తరమై యుండుట మఱువదగని విషయము.

భయము అనునదియే శిశువులకు ప్రబల శత్రువు. శిశువులకు ఎప్పుడుకూడ ఏమాత్రముకూడ భయము రేకెత్తించు అవకాశమును కల్పించరాదు.

తల్లిదండ్రులయందు అభిమానముతో కూడిన చెలిమి, ప్రేమతోకూడిన చనువు కలిగియుండుటయే బిడ్డయొక్క గొప్ప భాగ్యము.

తల్లి, తండ్రి, దాది అబద్ధములు చెప్పుచు బిడ్డనుమాత్రము అబద్ధమాడవద్దని హెచ్చరించుటలో అర్థములేదు.

శిశువులతో తలిదండ్రులు అనవసరముగ జోక్యము కలిగించుకొనకూడదు. వారి లోకమున వారిని స్వతంత్రముగ నిరభ్యంతరముగ పెరుగనీయవలెను.

బాలబాలికలకు పదునాఱేండ్లు పైబడిన పిమ్మట వారివారి తలిదండ్రులు వారిని స్నేహితులవలె చూడవలెను. తలిదండ్రుల అప్పటి బిడ్డల శిక్షణము ఉపదేశపూర్వకముగ నుండవలెనేకాని ఆజ్ఞాపూర్వకముగ నుండకూడదు.

శిశుశిక్షణము శిశువుపుట్టినతోడనే ప్రారంభము కావలయును.

ఇంతకును శిశుశిక్షణమన నేమి? క్రమమైన అలవాటులను నెమ్మదిగ నేర్పుట—ఉదాహరణపూర్వకముగ, ఆచరణపూర్వకముగ సరియైన విషయమును నిరంతరము స్ఫురింపజేయుచుండుట—శిశువుల పరిసరమును తగుమైన జాగ్రత్తతో శుచిగనుంచి వారిశీలమును చక్కదిద్దుట.

## అభినందనము

పారతంత్ర్యవిశృంఖలాబద్ధులైన
భారతీయుల స్వేచ్ఛాపిపాస యిట్లు
మూర్తిదాలిచి యీతపోముద్రబట్టె.

... ... ...

ఈమహాతపోజ్వాల లిర్లిగసి యెగసి
దారుణమ్మగు పారతంత్ర్యధ్వజమ్ము
నింధనముగాగ నెప్డొ భస్మించివైచు.

... ... ...

విస్తృతభారతవిమోచనముతో
విశ్వసోదరత వికసిస్తుంది!
విశ్వశుభోదయ మౌతుంది!

... ... ...

ఓలోకశుభకల్ప!
ఓనిర్వికల్ప!
ఓశాత్రవానల్ప!
ఓసత్యకల్ప!

లోకమంతా నీవిలక్ష్యపు
పోకడలలో వెలుగుగాంచెను
నీకు జయజయ పెట్టుచుండిరి
నిఖిల దిగ్రమణుల్.

—యద్రోజు మాధవాచార్య.




Printed at The Andhrabhumi Printing works, Vepery, Madras.
Editor & Publisher: Andra Seshagiri Rao. B.A.